


తిరుమల తిరుపతి దేవస్థానములు

# సప్తగిరి

సచిత్రమాసపత్రిక
నవంబరు 2015
వెల రూ.5/-

## తిరుమల శ్రీవారి పుష్పయాగ మహోత్సవం
18-11-2015




# తిరుచానూరు
# శ్రీ పద్మావతి అమ్మవారి బ్రహ్మోత్సవాలు-2015.
## డిశెంబరు 7 నుండి 16 వరకు

| తేదీ | వారము | పగటి ఉత్సవం | రాత్రి ఉత్సవం |
|---|---|---|---|
| 7-12-2015 | సోమవారం | -- | సేనాధిపతి ఉత్సవం, అంకురార్పణం |
| 8-12-2015 | మంగళవారం | తిరుచ్చి ఉత్సవం, ధ్వజారోహణం | చిన్నశేషవాహనం |
| 9-12-2015 | బుధవారం | పెద్దశేషవాహనం | హంసవాహనం |
| 10-12-2015 | గురువారం | ముత్యపుపందిరివాహనం | సింహవాహనం |
| 11-12-2015 | శుక్రవారం | కల్పవృక్షవాహనం | హనుమద్వాహనం |
| 12-12-2015 | శనివారం | పల్లకీ ఉత్సవం, సా॥ వసంతోత్సవం | గజవాహనం |
| 13-12-2015 | ఆదివారం | సర్వభూపాల వాహనం, స్వర్ణ రథోత్సవం | గరుడవాహనం |
| 14-12-2015 | సోమవారం | సూర్యప్రభవాహనం | చంద్రప్రభవాహనం |
| 15-12-2015 | మంగళవారం | రథోత్సవం | అశ్వవాహనం |
| 16-12-2015 | బుధవారం | పల్లకీ తిరుచ్చి ఉత్సవం, తీర్థవారి అవభృథము, చక్రస్నానం, పంచమీతీర్థం | తిరుచ్చిలో ధ్వజావరోహణోత్సవం |

ఊరకే దొరకునా వున్నతోన్నత సుఖము
సారంబు దెలిసికా జయము చేకొనుట



తలఁపు లోపలిచింత దాఁటినప్పుడు గదా
అలరి దైవంబు ప్రత్యక్షమౌట
కలుషంపు దుర్మదము గడచినప్పుడు గదా
తలకొన్న మోక్షంబు తనకుఁ జేపడుట

కర్మంబు కసటువోఁ గడగినప్పుడు గదా
నిర్మలజ్ఞానంబు నెరవేరుట
మర్మంబు శ్రీహరి నీ మఱఁగు చొచ్చినఁ గదా
కూర్మిఁ దన జన్మమెక్కుడు కెక్కుడౌట

తనశాంత మాత్మలోఁ దగిలినప్పుడు గదా
పనిగొన్న తన చదువు ఫలియించుట
యెనలేని శ్రీవేంకటేశ్వరుని దాస్యంబు
తనకు నబ్బినఁ గదా దరిచేరి మనుట
(2వ సంపుటం -104 వ సంకీర్తన)



అత్యున్నతమైన మోక్షసుఖం ఊరకే లభించేది కాదు. చిత్తాన్ని సంపూర్ణంగా భగవంతుని యందు లగ్నంచేస్తేనే దైవం ప్రత్యక్షమౌతాడు. జన్మజన్మలనుండి వెన్నంటి వచ్చే కర్మమాలిన్యాలను కడిగివేసినపుడే నిర్మలమైన జ్ఞానం కలుగుతుంది. శ్రీవేంకటేశ్వరుని దాస్యం లభించినపుడే సంసారసాగరం గట్టుచేరి జీవుడు సుఖిస్తాడు అని ప్రబోధిస్తున్నాడు అన్నమయ్య.

## మీ మాట

### అపూర్వం

శ్రీవారి బ్రహ్మోత్సవాల సంచిక అపూర్వం. భక్తుల హృదయాల్లో పవిత్రంగా దాచుకొనేలా ఉత్సవ వివరాల్ని అందించారు. ఈ సంవత్సరం శ్రీవారి బ్రహ్మోత్సవం రెండు విడతలుగా జరుపుకోవడం విశేషం. ఈ బ్రహ్మోత్సవాల్లో స్వామిని దర్శించుకోవడం పూర్వజన్మసుకృతం.

*– శ్రీమతి కులకర్ణి మీనాక్షి, మహబూబ్‌నగర్ జిల్లా.*

**శ్రీనివాసునికరుణాకటాక్షవీక్షణాలు**
**అందరిపై ప్రసరించాలనీ,**
**అందరికీ ఆ దేవదేవుడు**
**ఆయురారోగ్యఐశ్వర్యాలు**
**ప్రసాదించాలనీ ఆకాంక్షిస్తూ....**
**పాఠకులకు, రచయితలకు,**
**ఏజెంట్లకు, అందరికీ**



**దీపావళి**
**శుభాకాంక్షలతో..**
**మీ సప్తగిరి**

### తగ్గించండి

సప్తగిరిలో ఆధ్యాత్మికపరమైన వ్యాసాల నిడివి పెంచితే బాగుంటుంది. కేవలం ఒకటి రెండు పుటలకే పరిమితం చేస్తున్నారు. వ్యాసాల్ని మరిన్ని విశేషాలతో అందించండి. వ్యాసాలలో సాధ్యమైనంతవరకు శ్లోకాలు తగ్గించండి. వ్యవహార భాషలో వున్న వ్యాసాలు అందరినీ చదివిస్తాయి.

**– కావ్యసుధ, హైదరాబాదు.**

**2015, డిశెంబరు నెలలో**
**తిరుమల తిరుపతి దేవస్థానముల**
**ఉత్సవ విశేషాలు**

| | |
|---|---|
| 7 | తిరుచానూరు శ్రీపద్మావతి అమ్మవారి బ్రహ్మోత్సవ అంకురార్పణ, నాగులాపురం శ్రీవేదనారాయణస్వామివారి పవిత్రోత్సవ అంకురార్పణ. |
| 10 | తిరుమల శ్రీవారి సన్నిధిన అధ్యయనోత్సవం. |
| 12 | శ్రీపద్మావతి తాయార్ల గజవాహనోత్సవం. |
| 13 | శ్రీపద్మావతి తాయార్ల స్వర్ణరథోత్సవం. |
| 16 | పంచమీతీర్థం చక్రస్నానం, ధనుర్మాసం ప్రారంభం. |
| 17 | సుబ్రహ్మణ్యషష్ఠి, శ్రీపద్మావతి అమ్మవార్ల పుష్పయాగ మహోత్సవం. |
| 21 | వైకుంఠ ఏకాదశి, గీతాజయంతి, శ్రీకపిలేశ్వరస్వామివారి సన్నిధిన తెప్పోత్సవం ప్రారంభం. |
| 22 | శ్రీస్వామి పుష్కరిణి తీర్థముక్కోటి. |
| 26 | తిరుమల శ్రీవారి సన్నిధిన ప్రణయకలహమహోత్సవం. |

వేంకటాద్రిసమం స్థానం బ్రహ్మాండే నాస్తి కించన ।
వేంకటేశసమో దేవో న భూతో న భవిష్యతి ॥



**శ్రీహరి అనంతస్వరూపుడు**


గౌరవ సంపాదకుడు :
డా॥ డి. సాంబశివరావు, ఐ.ఏ.ఎస్.,
కార్యనిర్వహణాధికారి, తి.తి.దేవస్థానములు.

ప్రచురణకర్త-ప్రధాన సంపాదకుడు :
డా॥ సి.శైలకుమార్

సంపాదకుడు : డా॥ కె.రాధారమణ
ఉప సంపాదకురాలు : డా॥ అల్లాడి సంధ్య
ముద్రాపకురాలు : యమ్.గౌతమి, యమ్.బి.ఎ., ఉప కార్యనిర్వహణాధికారి, (ప్రచురణలు & ముద్రణాలయం) తి.తి.దే., తిరుపతి
డి.టి.పి. : ప్రధాన సంపాదకులవారి కార్యాలయం, తి.తి.దే., తిరుపతి
వర్ణ చిత్ర పుటలు : పి.శివప్రసాద్



***వివరాలకు :***
ప్రధాన సంపాదకుడు,
సప్తగిరి, తి.తి.దేవస్థానములు,
తిరుపతి - 517 507.
ఫోను : 0877-2264543, 2264359


సప్తగిరి మాస పత్రిక

| | | |
|---|---|---|
| విడి ప్రతి | : | రూ. 5/- |
| సం॥ చందా | : | రూ. 60/- |
| జీవిత చందా | : | రూ.500/- |
| విదేశాలకు సం॥చందా | : | రూ. 850/- |

# సప్తగిరి

## తిరుమల తిరుపతి దేవస్థానముల సచిత్ర మాసపత్రిక


సంపుటి : 46 నవంబరు, 2015 సంచిక : 6





website : www.tirumala.org, www.tirupati.org

24 గంటలు పనిచేసే
తిరుమల తిరుపతి దేవస్థానముల
కాల్ సెంటర్ ఫోన్ నెం.
0877 - 2277777, 2233333




ముఖచిత్రం : శ్రీవారికి పుష్పయాగం, తిరుమల.
చివరిపుట : శ్రీ కపిలేశ్వరస్వామివారి లక్షబిల్వార్చన. కపిలతీర్థం, తిరుపతి.



# హరినామస్మరణ

మానవ జన్మ అత్యంత విలువైనది. అత్యంత దుర్లభమైనది కూడా. నరజన్మద్వారానే పునరావృత్తరహితముక్తిని పొందగల్గుతాము. ఈ లోకంలో ఏది చేయాలన్నా దానికి ఉపకరణంగా శరీరం సహకరిస్తుంది. అయితే ఇది అశాశ్వతమైనది. అందుకే అన్నమయ్య **'నానాటి బ్రతుకు నాటకమని'** అభివర్ణించాడు. దేహం మాయతో నిండింది. దీనిని గ్రహించి మంచి బుద్ధిని, తద్వారా ప్రాప్తించిన దానితో తృప్తిని పొందాలి. భగవంతునిపై దృష్టిని నిలిపి జీవించాలి. సద్గుణాలను, సంస్కారాన్ని అలవర్చుకోవాలి. ఇందుకుగాను మానవుడు తన శక్తియుక్తులను సక్రమంగా వినియోగించుకోవాలి.

కృత, త్రేతా, ద్వాపరయుగాలలో భగవదనుగ్రహాన్ని పొందాలంటే ఎంతో తీవ్రంగా తపస్సు చేసేవారు. కాని ఈ కలియుగంలో అది అందరికీ సాధ్యం కాదు. అయితే భక్తిమార్గంలో పయనించి మానవుడు నామస్మరణ ద్వారా భగవంతుని చేరుకోవచ్చు. **'నామ సంకీర్తనం యస్య సర్వపాపప్రణాశనమ్'** నామ సంకీర్తనం సర్వపాపాలను నశింపచేస్తుందని శ్రీ వేదవ్యాసులవారు అన్నారు. భగవన్నామం తెలిసి పలికినా, తెలియకుండా పలికినా సమస్త పాపాలను నశింపచేస్తుంది. **'కలౌకేశవకీర్తనం', 'జపతో నాస్తి పాతకమ్'** అని అనేక ఋషివాక్యాలు భక్తిని సమర్థిస్తూ అసంఖ్యాకంగా ఉన్నాయి.

భగవన్నామస్మరణ చేస్తే మన మనస్సులోని అన్ని పాపాలు తొలగుతాయి. నారద, తుంబురులు, త్యాగయ్య, అన్నమయ్య, రామదాసులు ఇంకా ఎందరెందరో భగవన్నామాన్ని కీర్తించి తరించారు. సాహిత్యంకంటే శాస్త్రం, దానికంటే వేదాధ్యయనం, దానికంటే హరికీర్తనం శ్రేష్ఠమైంది. అందువల్లే హరినామ సంకీర్తనంకన్నా కలియుగంలో మోక్షానికి మరో సాధనం లేదు.

కలియుగంలో ఒక్క హరినామ స్మరణతోనే సకలపుణ్యాలు లభిస్తాయి. ఇది ఒక మానసిక తపస్సు. ఇందుకు ఎప్పుడూ ప్రసన్నంగా ఉండాలి. ఇతర చింతలు వదలి ఉన్నదానితో తృప్తిపడి భగవత్‌ధ్యానం చేసుకుంటూ జీవితం గడపాలి. మనకు చెడు చేసినవారికి కూడా మనం మంచి చేయడానికి సిద్ధపడాలి.

మహాభారతంలోని ఒక చిన్నపద్యం ధర్మాన్ని ఇలా వివరిస్తుంది.

**ఒరులేయవి యొనరించిన**

**నరవర అప్రియము తనమనమ్మునకగు తా**

**నొరులకు నవి సేయకునికి**

**పరాయణము పరమధర్మ పథములకెల్లన్‌।**

ఇతరులు ఏంచేస్తే మనమనస్సుకు బాధ కలుగుతుందో, దాన్ని మనం ఇతరులకు చేయకుండా వుండడమే గొప్ప ధర్మమని చెప్పబడింది. ఒక మనిషి ఉన్నతికి తోడ్పడేందుకు ఇంతకు మించిన ధర్మాచరణ ఇంకేముంది? **'సర్వేజనా సుఖినోభవంతు'** అనే భావంతో ఉండాలి. ధర్మాన్ని రక్షిస్తే అది మనలను రక్షిస్తుంది. నిత్యం శ్రీవారి నామాన్ని స్మరించుకుంటూ, ఇతరులకు హాని చేయకుండా జీవించడమే గొప్ప ధర్మం.





# అమావాస్యలో పున్నమి

పండుగ

డా॥ కె.రాధారమణ, తిరుపతి

దీపావళి అందరి పండుగ. ఆనందమైన పండుగ! తమసోమా జ్యోతిర్గమయా... అన్న వేదవాక్కుకు ప్రతీకగా నిలిచిన పర్వదినం దీపావళి. మన దేశంలో ఈ పండుగను మూడురోజులు జరుపుకుంటారు. మొదటిరోజు 'నరకచతుర్దశి'. రెండవరోజు 'దీపావళి'. మూడవరోజు 'బలి పాడ్యమి'. ప్రధానంగా మన తెలుగువారు మొదటి రెండు రోజుల పండుగ మాత్రమే జరుపుకుంటారు.



'నరకచతుర్దశి'గా వ్యవహరింపబడే దీపావళి పండుగను ప్రతి సంవత్సరం ఆశ్వయుజ కృష్ణచతుర్దశి రోజున జరుపుకుంటారు. ఈ పండుగకు సంబంధించిన కథలు చాలా ఉన్నాయి.

శ్రీకృష్ణభగవానుడు సత్యభామ సహాయంతో లోకకంటకుడైన నరకాసురుని సంహరించాడు. అందువల్ల ఇది 'నరక చతుర్దశి'గా పేరు గాంచింది.

నరకాసురవధను గూర్చిన కథలు భాగవతంలోను, హరివంశంలోను మనోహరంగా చెప్పబడివున్నాయి. ముందుగా శ్రీకృష్ణుడు కౄరుడైన మురాసురుని వాని కొడుకులను పూర్తిగా సంహరించాడు. నరకాసురుడు కృష్ణునిపై యుద్ధం ప్రకటించాడు. సత్యభామా సహాయుడై యుద్ధానికి వెళ్ళాడు కృష్ణుడు. సత్యభామ యుద్ధంలో అలసిపోగా తన చక్రాయుధంతో నరకాసురుణ్ణి సంహరించాడు శ్రీకృష్ణుడు. అదే

**పండుగనాడు పిల్లలు పెద్దలు సంప్రదాయ వస్త్రాలు ధరించాలి. ప్రతి ఒక్కరు గుడికి వెళ్లి దైవదర్శనం చేసుకోవాలి. తమ ఇళ్లకు బంధువులను ఆహ్వానించి వారితో గడపాలి. బంధువుల ఇళ్లకు వెళ్లాలి. ఇంటిని దీపాలతో అలంకరించాలి.**





నరకమనగా యమలోకం! యమలోకాన్ని పొందకుండా, ఒకవేళ పొందినా, దానినుండి విముక్తిని పొందడానికై యముని పూజించే పండుగ ఇది! యమునికి ప్రీతి కలిగించే చతుర్దశి రోజు తెల్లవారుజామున లేచి నువ్వులనూనెతో తలంటుకొని అభ్యంగన స్నానం చేస్తారు. నువ్వుల నూనెలో లక్ష్మీదేవి, నీళ్ళలో గంగాదేవి ఉంటారని ప్రతీతి! అభ్యంగన స్నానం చేస్తూ మూడుసార్లు యమునికి అర్ఘ్యం విడుస్తారు. ఆ రోజు మినపపప్పు మినప ఆకులతో వంటలు చేసుకొని తింటే పాపాలు పోతాయని ప్రసిద్ధి. ఆ సాయంత్రం చీకట్లను పారదోలుతూ, సంధ్యాకాలం

'నరకచతుర్దశి'. అందుకు దీపాలను వెలిగించి పండుగ చేసుకుంటారు. దీపావళి అనగా దీపాల వరుస అని అర్థం. నరకుడు నశించినందుకు ఆనందంగా జరుపుకునే పండుగ ఇది!

వామనుడు త్రివిక్రముడై బలిచక్రవర్తి రాజ్యాన్ని రెండు పాదాలచేత ఆక్రమించి, మూడవ పాదంచేత బలిని పాతాళ లోకానికి అణగదొక్కిన రోజుగా దీపావళిని పురాణాలు పేర్కొంటున్నాయి.

రావణ వధానంతరం శ్రీరామచంద్రుడు అయోధ్యకు వచ్చినప్పుడు ప్రజలందరు ఆనందంతో ఇళ్లల్లో దీపాలు వెలిగించారు.

**ఉత్తరభారతదేశంలో ఈ పండుగను 'దివాలీ' అంటారు. వారికి ప్రధానం శ్రీమహాలక్ష్మీదేవి పూజ. దీపావళికి కొన్ని వారాల ముందే వారు తమ ఇళ్లను శుభ్రపరచుకుంటారు.**

**దీపావళి నాటి రాత్రి మహాలక్ష్మీదేవి, వైకుంఠం నుంచి భూతలానికి వస్తుందట. భూమిమీద తనకు అత్యంత ఆకర్షణీయంగా కనిపించిన ఇంటిని చూసుకొని తన అనుగ్రహాన్ని ఆ ఇంటి మీద వర్షిస్తుందట.**

నందే దీపాలు వెలిగించాలి. ఇక ఆ మరునాడు దీపావళి పండుగనాడు సూర్యోదయానికి ముందుగానే లేచి స్నానాలు చెయ్యాలి. పంచపల్లవాలు అనగా మర్రి, మామిడి, మేడి, జువ్వి, నేరేడు ఈ ఐదురకాల ఆకులను నీళ్ళలో వేసి ఆ నీళ్ళతో స్నానం చేయాలి. మళ్ళీ దీపావళినాటి ప్రదోష సమయంలో అనగా సంధ్యాసమయంలో నువ్వుల నూనెతో దీపాలు వెలిగించాలి. ముఖ్యంగా ఇంటి ద్వారానికి ఇరువైపులా, రావిచెట్టు, తులసిచెట్టు, వంట ఇంట్లో, దేవుని దగ్గర, బావి దగ్గర ఇలా వీలైనన్నిచోట్ల వరుసగా దీపాలను వెలిగించాలి. ఆ తర్వాత లక్ష్మీపూజ చేయాలి.



రాత్రి పూట బాణసంచా కాల్చాలి. ఆ మరునాడు బలిపాద్యమినాడు 'బలిచక్రవర్తి' ని పూజిస్తారు. ఆ మరునాడు విదియనాడు 'భగినీ హస్త భోజనం' పేరుతో వేడుక జరుగుతుంది. ఈ రోజు మగపిల్లలు తమ అక్క లేదా చెల్లిలింటికి వెళ్ళి, ఆమెకు పసుపు కుంకుమలు, చీర, రవికలు, పండ్లు ఫలాలు, పిండివంటలు మున్నగునవి సమర్పించి, వారిచేత మంగళాక్షతలతో ఆశీస్సులను పొందాలి. తదుపరి వారి చేతి వంటకాలను భుజించాలి. ఇలా భోజనం చేస్తే సోదరులకు ఆయురారోగ్యాలు వృద్ధి చెందుతాయని విశ్వాసం! దాన్నే 'భగినీ హస్త భోజనం' అంటారు. పూర్వం తెలుగునాట ఆచరణలో ఉండే ఈ 'భగినీ హస్త భోజనాలు' అన్నా చెల్లిళ్ళ ప్రేమలు వృద్ధి పొందడానికి దోహదం చేసేవిగా ఉండేవి.

దీపావళినాడు అందరూ టపాకాయల్ని కాలుస్తారు. ఆలయాల్లో ఈరోజున దీపారాధన జరుగుతుంది. అటు ఆకాశంలో కూడా ఈ ఋతువులో కాంతివంతమైన నక్షత్రాలు పెద్దపెద్దదీపాలు వెలిగించినట్లు కనిపిస్తాయి. ఈ దీపాలతోపాటు పిల్లల ముఖాలు ఆనందంతో కళకళలాడుతుంటాయి. కొందరిళ్ళల్లో ఈ రోజున కేదారగౌరీవ్రతం అనే వ్రతాన్ని ఆచరిస్తారు. మర్నాడు పాడ్యమికి జరిగే పండుగపేరు బలిపాడ్యమి. వామనావతారకథ ఈ రోజు జరిగిందని చెప్తారు. వామనుని ఆదేశాలను అనుసరించి పాతాళానికి పోయిన బలి ఈ రోజున తిరిగి భూలోకానికివచ్చి సంచరిస్తాడట. ఇంటింటా స్వాగతసత్కారాలు చేయాలని పూర్వులు నిర్ణయించారు. ఇంట్లో రకరకాల ముగ్గులతో పూజలు చేస్తే బలి ఆశీర్వదిస్తాడని విశ్వాసం.

**రావణసంహారం తరువాత శ్రీరాముడు అయోధ్యా నగరానికి వచ్చినరోజు ప్రతిఇంట్లో దీపాలను వెలిగించి వేడుకలు చేసుకున్నారు. ఇది దీపావళి పండుగకు సంకేతంగా భావించాలి.**

ఇలాగ దివ్యమైన పండుగ దీపావళిని రెండురోజుల పండుగగా, మూడురోజుల పండుగగా, ఐదురోజుల పండుగగా వివిధ ప్రాంతాల్లో పలువిధాలుగా జరుపుకుంటారు. ప్రధానంగా ఆశ్వయుజ కృష్ణ చతుర్దశినాడు తెల్లవారుజామున అభ్యంగన స్నానం చేసి ఇంటి ముంగిట్లో, లోగిళ్ళలో దీపాలను వెలిగిస్తారు. దీపావళి రోజున లక్ష్మీపూజ చేసుకుంటారు.

భారతదేశమంతటా వైభవంగా జరుపుకునే ముఖ్యమైన పండుగల్లో అందమైనది, ఆనందమైనది "దీపావళి" పండుగ. అమావాస్యనాడు వచ్చే పున్నమి ఈ పండుగ. చెడుపై మంచికి కలిగే విజయానికి నిదర్శనమే ఈ దివ్వెల ఉత్సవం. చీకటితెరలు తొలగి తమ జీవితాల్లో వెలుగురేఖలు విరజిమ్మాలని, తమ ఇంట వెలుగు నింపటానికి హైందవులు దీపావళి పండుగను పురస్కరించుకొని మట్టి ప్రమిదలలో నూనె దీపాలను వెలిగించి ఆనందదీపావళిని స్వాగతిస్తారు.

సర్వభక్తజనావళి భక్తి పారవశ్యంతో శ్రీమహాలక్ష్మికి పూజలు నిర్వహించడంతో పండుగ సంరంభం మొదలౌతుంది. కలియుగ వైకుంఠవాసుడైన శ్రీవేంకటేశ్వర స్వామి హృదయకమలంలో విలసిల్లుతున్న శ్రీమహాలక్ష్మిని ఆహ్వానించి (ఆవాహన చేసి) సంపదల కోసం ధ్యానిస్తారు.

భారతీయ సంస్కృతిలో మంగళకరానికి ప్రతిరూపమైన దీపజ్యోతికి విశిష్ట స్థానం ఉంది. ఈ రోజు సాయంత్రం ప్రమిదలలో దీపాలు వెలిగించి అందంగా



పేర్చడంతో ప్రతి ఇల్లు లక్ష్మీకళతో శోభిల్లుతుంది. ఈ రోజు రాత్రి ఇంటిల్లిపాదీ ఎంతో సంబరంగా బాణసంచా పేలుస్తారు. గగనతలంలో బాణసంచా ప్రేలుళ్లు మిన్నుముడతాయి; తారాజువ్వలు చీకటిని చీల్చుకుంటూ దూసుకెళ్ళి వెలుగులపూలను విరజిమ్ముతాయి. ఇది ఒక ఆనంద ముద్ర!! శ్రీమహాలక్ష్మిని ఆరాధిస్తూ ఎంతో వైభవంగా జరుపుకునే కాంతివంతమైన దీపావళి పండుగశోభ ప్రతి భారతీయునిలో మిగిల్చే ఆనందానుభూతి వర్ణనాతీతం.



ఈ దీపావళి రోజు రాత్రి, శ్రీమహాలక్ష్మిభూలోక సంచారం చేయునని పెద్దల విశ్వాసం. ఈ విధంగా సంతోషంతో చేసుకునే దీపావళి పండుగ మనందరి జీవితాలలో వెలుగులునింపాలని ఆశిద్దాం! భారతీయుల ఇలువేల్పు ఆనందనిలయుడైన శ్రీపతిని అనన్యభక్తితో నరకతుల్యమగు ఈ భువిని స్వర్గము చేయమని ప్రణమిల్లుటే ఈ పర్వదినము యొక్క ముఖ్య ఉద్దేశ్యం!!





# అలమేలుమంగాపురం
## (తిరుచానూరు)

**తిరుపతికి 5 కి.మీ. దూరంలో ఉన్న ప్రాచీనమైన క్షేత్రం తిరుచానూరు. దీన్నే అలమేలుమంగాపురం అనికూడా అంటారు. శ్రీ వేంకటేశ్వరస్వామివారి దేవేరి శ్రీపద్మావతిఅమ్మవారు ఇచట పూజలందుకొంటున్నది. తిరుమల యాత్రికులు తిరుచానూరు అమ్మవారిని దర్శించినట్లయితే తమ యాత్ర ఫలవంతమవుతుందని ప్రసిద్ధి. అందువల్లే తిరుమల యాత్రికులు, తిరుచానూరుకు వెళ్లి, శ్రీ పద్మావతిఅమ్మవారిని పూజిస్తారు. తిరుచానూరులో ఉన్న పవిత్రపుష్కరిణి ''పద్మసరోవరం''లో శ్రీపద్మావతిఅమ్మవారు ఆవిర్భవించినారని పురాణ ప్రసిద్ధి.**

**7.12.2015 నుండి 16.12.2015 తేదివరకు**

**శ్రీపద్మావతి అమ్మవారి బ్రహ్మోత్సవాలు**



# లోకదీపకుని సన్నిధిలో...



తిరుమల శ్రీ వేంకటేశ్వర స్వామికి జరిగే వార్షిక ఉత్సవాల్లో 'దీపావళి ఆస్థానం' ఒకటి. ఆశ్వయుజమాసం అమావాస్య దీపావళినాటి ఉదయం యథాప్రకారం శ్రీవారి ఆలయంలో సుప్రభాతం మొదలుకొని మొదటి నైవేద్యం వరకు జరుపుతారు.

బ్రహ్మోత్సవ సమయంలో శ్రీమలయప్ప స్వామివారు శ్రీదేవి, భూదేవి సమేతంగా రంగనాయక మండపంలో వేంచేసి వుంటారు. శ్రీమలయప్ప స్వామివారిని దీపావళినాడు బంగారువాకిలి ముందు, ఏర్పాటు చేసి ఉన్న సర్వభూపాలవాహనంలో వేంచేపు చేస్తారు. శ్రీగరుడాళ్వారుకు అభిముఖంగా ఉన్న శ్రీమలయప్పస్వామికి ప్రక్కనే దక్షిణముఖంగా మరొక పీఠంపైన శ్రీవారి సేనాధిపతి అయిన విష్వక్సేనులవారిని కూడ వేంచేపు చేస్తారు.

**తిరుమల శ్రీవారి ఆలయంలో దీపావళి ఆస్థానం 11-11-2015**

**తెలుగువారి ఇలువేల్పు, ఇలవేల్పు అయిన తిరుమలేశుని సన్నిధిలో కూడ 'దీపావళి' పండుగ ఘనంగా జరుగుతుంది. తిరుమల శ్రీవారి ఆలయంలోని బంగారువాకిలి ముందు దీపావళి పండుగనాటి ఉదయం అత్యంతవైభవంగా ఆస్థానం జరుగుతుంది. దీన్నే "దీపావళి ఆస్థానం" అంటారు.**

ఆ తర్వాత రెండవ నివేదన ప్రారంభమవుతుంది. గర్భాలయంలోపల మూలమూర్తికి, బంగారు వాకిలి ముందు ఉన్న శ్రీమలయప్పస్వామికి రెండవ అర్చన చేస్తారు. తర్వాత శ్రీవారి వంటశాలనుంచి ఛత్రచామర మంగళవాద్య పురస్సరంగా పిండి వంటలను, ఊరేగింపుగా బంగారు విమాన ప్రదక్షిణంగా తీసుకొనివస్తారు. గర్భాలయంలో శ్రీవారికి, బంగారువాకిలి ముందు శ్రీమలయప్పస్వామివారికి నివేదన చేస్తారు. ఆ తర్వాత పెద్ద జియ్యంగారు ఆరు పట్టువస్త్రాలను వెండి పళ్ళెంలో తెస్తారు. దేవస్థానం అధికారులు మంగళవాద్య పురస్సరంగా, ఊరేగింపుగా విమానానికి, ధ్వజస్తంభానికి ప్రదక్షిణగా వచ్చి ఆనందనిలయం లోపల సమర్పిస్తారు. వాటిలో నాలుగు వస్త్రాలను అర్చకులు స్వీకరించి శ్రీవారి మూలమూర్తి కిరీటానికి, ఖడ్గానికి, ఉత్తరీయంగాను, ఆది తోమాలగాను అలంకరించి అక్షతారోపణం చేస్తారు. మళ్ళీ మిగిలిన రెండువస్త్రాలను జియ్యంగార్లు తీసుకొని బయటకు రాగా, ఒక దానిని మలయప్పస్వామికి, రెండవ దానిని విష్వక్సేనులవారికి అర్చకులు అలంకరిస్తారు.

ఆ తర్వాత శ్రీవారి అర్చకులు శ్రీస్వామివారికి, సేనాధిపతికి అక్షతారోపణ చేస్తారు. పిదప ఘనంగా శ్రీస్వామివారికి ఆనంద కర్పూరనీరాజనాలు సమర్పిస్తారు. పిదప అక్కడ చేరిన స్థానీయులైన మహంతు, తాళ్ళపాక, తరిగొండ వారి హారతులు కూడా ఇస్తారు. పిదప శ్రీవారి ప్రసాదం వినియోగం అవుతుంది.

దీపావళినాడు బంగారు వాకిలి ముందు జరిగే ఆస్థానం ఏకాంతంగా జరుగుతుంది. యాత్రికులు దర్శించడానికి వీలు పడదు.

దీపావళి ఆస్థానం పూర్తి అయిన వెంటనే శ్రీదేవి భూదేవి సమేతంగా శ్రీమలయప్పస్వామి భక్తాదులు నిర్వహించే కల్యాణోత్సవాది ఆర్జిత సేవల్లో పాల్గొనడానికి కల్యాణ మండపానికి వేంచేస్తారు. 



# ముగ్గురు పద్మావతులు

డా॥ సముద్రాల లక్ష్మణయ్య, తిరుపతి

ఈ సంవత్సరం అధికమాసం కారణంగా తిరుమలలో రెండు బ్రహ్మోత్సవాలు సంభవించాయి. వీటితోపాటు యథావిధిగా కార్తికమాసంలో శ్రీపద్మావతీదేవికి కూడా బ్రహ్మోత్సవాలు జరుగుతాయి. తిరుమలలో జరిగే ఉత్సవాలలాగే తిరుచానూరులో జరిగే ఉత్సవాలు ఇటీవలి కాలంలో భక్తులను విశేషంగా ఆకర్షిస్తున్నాయి.

**స్వామివారికి నిత్యానపాయినిగా, పురుషకార స్వరూపిణిగా, భక్తానుగ్రహకారిణిగా విలసిల్లిన ఆ లక్ష్మీదేవి లోకమాత. పద్మావతీదేవి ఆమె దివ్యావతారమే. అందువల్ల తిరుమలలో వలె తిరుచానూరులో కూడా అమ్మకు బ్రహ్మోత్సవాలు నిర్వహించడం సంప్రదాయమయింది.**



పద్మావతీదేవి కార్తిక - శుక్ల - పంచమి - శుక్రవారంనాడు ఆవిర్భవించింది. కాన ఆ తిథుల కనుగుణమైన కాలంలో తిరుచానూరులో ఉత్సవాలు జరగడం పరిపాటి.



వేదవతి అపరజన్మలో పద్మావతిగా ఆవిర్భవించిందని పురాణాలు చెబుతున్నాయి. ఆకాశరాజుకు లభించిన పద్మావతి పూర్వజన్మలో వేదవతి. తనపట్ల మోహావిష్టుడైన రావణుణ్ణి వేదవతి తిరస్కరించింది. యోగబలంతో అగ్నిప్రవేశం చేసింది. అగ్ని ఆమెను తనలో భద్రంగా దాచుకొన్నాడు. రావణుడు సీతను అపహరించడానికి వచ్చినప్పుడు అగ్నిదేవుడు వేదవతిని సీతగా మార్చి రావణునికి చూపాడు. అసలు సీతను ఆరాక్షసుడు అపహరించకుండా కాపాడాడు. లంకలో ఉన్నది సీతగా మారిన వేదవతియే. రావణ వధానంతరం అగ్ని పరీక్షాకాలంలో అగ్నిదేవుడు తనలో దాచిన నిజమైన సీతను రామునికర్పించాడు. వేదవతిని తనలో ఐక్యం చేసుకొన్నాడు. ఆ వేదవతియే మరుజన్మలో అకాశరాజుకు



పద్మావతీరూపంలో లభించింది. ఈ కథ పురాణాలలో చెప్పబడింది. శ్రీనివాసుడుగా వేంకటాద్రిలో అవతరించిన శ్రీరాముడు లక్ష్మీవియోగం కల్గినప్పుడు ఆ పద్మావతిని పరిణయమాడినాడు. ఆమె శ్రీవేంకటేశ్వరుని సన్నిధిలోనే ఉన్నది.

ఈనాడు తిరుచానురులో ఉన్న పద్మావతి ఆకాశరాజు పుత్రిక కాదు. ఆమె సాక్షాత్తు వైకుంఠంలో ఉండే లక్ష్మీదేవియే. పద్మంలో పుట్టడంవల్ల పద్మావతిగా ప్రశస్తి పొందింది.

భృగువు విష్ణువు వక్షఃస్థలాన్ని తన్నినప్పుడు కోపించిన శ్రీదేవి వైకుంఠం వదలి భూలోకానికి వచ్చి కొల్లాపురం చేరింది. కరవీర లక్ష్మిగా అక్కడ భక్తుల పూజలందుకున్నది. ఆకాశరాజు కుమార్తెకూ శ్రీ వేంకటేశ్వరునికీ వివాహం జరిగినపుడు ఈ లక్ష్మి కూడా వివాహానికి హాజరై మరల వెళ్ళిపోయింది. శ్రీనివాసుడు తన్ను విడిచి వెళ్ళిన లక్ష్మిని అన్వేషించాడు. ఆమె కొల్లాపురం వీడి పాతాళానికి పోయింది. కపిలమహర్షి ఆమెను ఆదరించాడు.

శ్రీనివాసుడు లక్ష్మిని గూర్చి తపస్సు చేశాడు. స్వర్ణముఖీ తీరంలో తపస్సు చేస్తే లక్ష్మి దర్శనమిస్తుందని ఆకాశవాణి ఆ దేవునికి తెలియజేసింది. గగనవాణి మాట ప్రకారం శ్రీనివాసుడు వేంకటాద్రి చెంత ప్రవహించే స్వర్ణముఖివద్ద లక్ష్మికై తపస్సు చేశాడు. ఇంతలో కపిలమహర్షి లక్ష్మిననునయించి హరి చెంతకు పొమ్మన్నాడు. ఆమె దివ్యదేహం ధరించి తిరుచానూరు పద్మసరస్సులో పద్మనాళంలో ప్రవేశించి కార్తికశుక్ల పంచమినాడు ఆవిర్భవించింది. ఇలా సాక్షాత్కరించిన లక్ష్మీదేవియే వ్యూహలక్ష్మి.

వ్యూహలక్ష్మితో సహా అక్కడ వీరలక్ష్మి కూడా జనించింది. వ్యూహలక్ష్మి విష్ణుదేవుని వక్షస్థలంపై నెలకొన్నది. వీరలక్ష్మి తిరుచానూరులో దేవతగా వెలసి పద్మావతిగా ప్రశస్తి



**కొల్హాపూరు శ్రీమహాలక్ష్మి అమ్మవారు**

పొందింది. పాంచరాత్రాగమానుసారంగా నేటికీ పూజలందుకొంటున్నది. ఈ కార్తికంలో జరిగే బ్రహ్మోత్సవాలు ఆమెకు చెందినవే.

వీరలక్ష్మిని కూడా తనతోబాటు వేంకటాద్రికి రమ్మని వేంకటేశ్వరుడు అర్థించాడు. కాని ఆమె అందుకు అంగీకరించలేదు. "స్వామీ! నీవు నా కొరకై తపస్సు చేసిన పవిత్ర స్థలమిది. నీవు నా హృదయంలో ఉండు. ఈ వ్యూహలక్ష్మిని ఉరఃస్థలంలో నిలుపుకో. నన్నిక్కడే నిలిపి కాపాడు. నేను రాలేదని చింతించవద్దు. వ్యూహలక్ష్మి రూపంలో ఉన్నది కూడ నేనే. కార్తికశుక్లపంచమినాడు నీ పుష్పహారమొకటి నావద్దకు పంపు. ప్రియమైన వస్త్రం కూడా దానితోపాటు పంపించు. ఇక్కడ జరిగే ఉత్సవాలనంగీకరించి నీకే అవన్నీ అర్పిస్తాను" అని వీరలక్ష్మీదేవి స్వామితో చెప్పింది.

ఈ రీతిగా వేదవతికి మారురూపమైన పద్మావతి, వ్యూహలక్ష్మిగా రూపొంది విష్ణువక్షఃస్థలం చేరిన పద్మావతి, వీరలక్ష్మిగా తిరుచానూరులో నెలకొన్న పద్మావతి అని ముగ్గురు పద్మావతులు ఉన్నారు. వీరి అన్యోన్యభేదాన్ని పురాణోక్తిని బట్టి గ్రహించాలి.





# దైవధ్యానం

కాశీభట్ల సుబ్బరామశర్మ, ప్రొద్దుటూరు

భగవంతుణ్ణి ప్రార్థించడం అంటే నిర్మల హృదయంతో సంభాషించడమే ప్రార్థన ప్రాణిని పరమాత్మ సన్నిధిని చేర్చేందుకు సులభసాధన.

భగవంతుని వాత్సల్యంమీద, సామర్థ్యంమీద దృఢ విశ్వాసం లేనప్పుడు ఏ ప్రార్థన పనిచేయదు. విశ్వాసమే లేనపుడు ప్రార్థనతో పనేముంది? అహంకారం ప్రార్థనకు విఘాతాన్ని కలిగించే భావం.

**ప్రార్థనకు ప్రధానమైంది హృదయశుద్ధి. లోకంలో మనం ప్రబలశత్రువులతో ఓడిపోయినపుడు, ఏ ఉపాయం తోచనపుడు మనల్ని మనవారిని కాపాడుకోవడానికి భగవంతుణ్ణి ప్రార్థిస్తుంటాం. భక్తి, విశ్వాసాలతో వినయంతో నిర్మలహృదయంతో చేసే ప్రార్థననే భగవంతుడు వినగలుగుతాడు. ఆపదలు నివారిస్తాడు.**

గజేంద్రుడు తన దేహంలో బలం ఉన్నంతవరకు, ఇతర ఏనుగులు తనకు సాయపడుతాయనే అభిమానమున్నంతవరకు భగవంతుణ్ణి ప్రార్థించలేదు. వేలయేండ్లు మొసలితో పోరాడి పోరాడి దాని బలం క్షీణించి, శక్తి నశించి, మనస్సు శిథిలమైనాక. చివరికి అన్నిటిపైనా విశ్వాసాన్ని విడచిపెట్టి "నీవే తప్ప నితః పరంబెరుంగ" అని భగవంతుణ్ణి శరణు పొందాడు.

సామాన్యంగా ఆపన్నివారణకు, యోగక్షేమాలను పొందడానికి పరమాత్మ తత్త్వమవగాహన చేసుకోవడానికి ప్రార్థనలు చేస్తుంటారు. ప్రపంచంలో పలువిధాలైన ఆపదలు కష్టాలు కలుగుతుంటాయి. భగవంతుని అనుగ్రహంవల్ల అన్నీ సునాయాసంగా తొలగి పోతుంటాయి. భగవంతుడు సత్య సంకల్పుడు. సర్వాంతర్యామి. సర్వసమర్థుడు. సర్వనియంత. అతడు సంకల్పిస్తే ఏమైనా చేసి తీరుతాడు. అన్నీ పరమాత్మ సంకల్పాధీనాలే. ఎక్కడైనా, ఎవ్వరివల్లనైనా, ఎటువంటి కీడు గలిగినా దాన్ని తొలగించడానికి పరమాత్మకెలాంటి భారం లేదు. ఆ కరుణాపయోనిధికి మనపై కరుణ ప్రసరించేలా చేయడమే విధి. భగవంతునిలో అనుగ్రహభావాన్ని పెంపొందించడానికి ప్రార్థన ఆమోఘసాధనం.

భగవంతుడు ద్రౌపదికి అక్షయ వస్త్రాలిచ్చి అనుగ్రహించాడు. మొసలిని చక్రాయుధంతో ఖండించి సంకటాలనుండి ఏనుగును సంరక్షించాడు. ప్రహ్లాదునిలో తన దివ్యశక్తిని ప్రవేశింపజేసి హిరణ్యకశిపుడి బాధలనుండి కాపాడాడు.

అసురులచే బాధింపబడిన దేవతలుగూడ తమను కాపాడమని భగవంతుణ్ణి శరణుపొందారు. దయాసముద్రుడైన భగవంతుడు వారి ప్రార్థనను మన్నించి వారిని రక్షించాడు. రక్షింపమని ప్రార్థించడం తక్కువతనంగాదు.







**హృదయం నుండి వెలువడే ప్రార్థనలో అనంతశక్తి ఉంది. హృదయంలో ప్రబలమైన భావశక్తిలో పాషాణాన్ని కూడ పగుల గొట్టవచ్చు. భక్తవత్సలుడైన భగవంతునికై ఈ శక్తి పని చేయకుండా పోతుందా? అతణ్ణి తప్పక కరిగిస్తుంది. తనవైపుకు త్రిప్పకొంటుంది. ఇష్టసిద్ధి కలిగిస్తుంది.**

ఆర్తహృదయంతో చేసే ప్రార్థనలు మనస్సుకు ఊరట కలిగిస్తాయి. మనోవికారాలు తొలగిపోతాయి. దైవంతో సంబంధాన్ని చేకూరుస్తాయి. ప్రార్థన దైవశక్తికేంద్రాన్ని మేల్కొలుపుతుంది. దైవంతో మాట్లాడే సాహసాన్ని, ఉత్సాహాన్ని కలిగిస్తుంది. కోరికలు నెరవేరుస్తుంది.

భగవత్ప్రార్థనవల్ల మనలోనుండి ఒక ఆధ్యాత్మిక ప్రవాహం ప్రసరిస్తుంది. ఆ దైవశక్తి కారణంగా చింతలు, రోగాలు వ్యాధులు దౌర్బల్యాలు అన్నీ నశిస్తాయి.

ప్రార్థన సహజప్రవృత్తి. ఇది దేశకాలాలకు పరిమితంకాక, విశ్వవ్యాపకమైంది. సనాతనకాలం నుంచీ మానవుడు నానాకష్టాలు అనుభవించేటప్పుడు తనకంటే ఒక మహాశక్తికి తలవంచుతాడు.



యాంత్రికంగా చేసే ప్రార్థన ఆదర్శ ప్రార్థన అనిపించుకోదు. మన ప్రార్థన అర్థ భావనాదృష్టి లేకుండానే చదువుతున్నాము. మనమేది చదివామనే దృష్టి కూడా చాలామంది కుండదు. చిలుకపలుకుల్లా పలుకుతుంటారు. అంటే వానిపై మనస్సు లగ్నం కాలేదన్నమాట. కేవలం నోటితో ప్రార్థనా శ్లోకాలుగాని, మంత్రాలుగాని వల్లిస్తుంటారు. మనస్సేమో ప్రాపంచికవిషయ సుఖాలపై పరిభ్రమిస్తూ వుంటుంది. ఆదర్శప్రార్థనలో మనస్సు, వాక్కు, శరీరం ఏకీభవించి ఉంటాయి. ప్రార్థన చేసేటప్పుడు మనస్సు భక్తితో పులకిస్తుంది. నిజమైన ప్రార్థనలో స్వార్థం ఏమాత్రం ఉండదు.

ఆదర్శప్రార్థనలో కల్లకపటాలుగాని, డాంబికంగాని ఉండవు. వారానికొకసారి గాని, దినానికి రెండుసార్లుగాని చేయాలనే నియమనిబంధనలుండవు. కాలదేశనియమాలసలే ఉండవు. దానికి హృదయంతో సంబంధం వుంటుంది. కాబట్టి అనుక్షణం చేయబడుతూనే ఉంటుంది. ప్రార్థన చేయని ఒక క్షణమైనా సాధకునికొక యుగంగా తోస్తుంది. అతనికంతా వ్యాకులమే.

భక్తుడు తన దైవాన్ని ప్రార్థించేటప్పుడు తన దైవమెక్కడో దూరంగా ఆకాశంలో కూర్చొని ఉన్నట్లు అనుకోడు. అనుక్షణం తనతోనే ఉన్నట్లు భావిస్తాడు. ఈ అనుభూతివల్ల అతని జీవితమే మారిపోతుంది. వేయికండ్లలో సమస్తాన్ని తిలకించే పరమాత్మను చూచేవాడు పాపకార్యాలకు పూనుకొంటాడా? అపమార్గంలో పయనిస్తాడా?

నిజమైన ప్రార్థన చేసేవాడు పరహితాన్ని కాంక్షిస్తుంటాడు. ఆత్మీయ పరకాయభేదమే అతనికుండదు. సర్వత్ర సర్వేశ్వరునే చూస్తుంటాడు. చరాచరప్రపంచమంతా పరమాత్మ వ్యాపించి ఉందనే భావిస్తుంటాడు. అతని ప్రతి చిన్న పనిలోనూ ప్రపంచశ్రేయస్సే కనబడుతుంది.

ప్రార్థన అనేది భగవత్కృపతో మిళితమై వికలాంగుని గూడ కొండల దాటింపచేస్తుంది. సాధ్యం గాని పనులగూడ అవలీలగా చేయిస్తుంది.





పసిపిల్లవాడైన ధ్రువుడు యధార్థప్రార్థనచేసే ధ్రువపదాన్న నధిష్ఠించి తనపేరు సార్థకం చేసుకున్నాడు.

నందగోకులంలోని గోపికలు సగుణ సాకార ముగ్ధమోహనమూర్తిని ఆరాధించి మోక్షాన్ని కూడ తిరస్కరించారు. ఈనాటికి వారు పరమప్రేమరూప భక్తితత్త్వానికి ఆదర్శ ప్రాయులైనారు. వారి ప్రార్థన యధార్థమైనదే. కుంతి కూడా ఐశ్వర్య మదంలో నిన్ను విస్మరిస్తానని ఆపదలనే కోరుకుంది. రంతిదేవ మహారాజు పరులదుఃఖాలకు స్పందించి ఇతరుల దుఃఖాన్ని దూరం చేయడానికే తన జీవితాన్ని గడిపాడు. అట్టి దుఃఖాలన్నీ తనపైనే వేయమని తాను భరిస్తానని భగవంతుణ్ణి ప్రార్థించాడు.

శరీరానికి భోజనం అవసరమైనట్లు ఆత్మకు ప్రార్థన అవసరం. మానవుడు భోజనం లేకుండా కొన్ని రోజులు గడపగలడు కాని భగవంతునిపై విశ్వాసం గలవాడొక క్షణం కూడా ప్రార్థన చేయకుండా జీవింపలేడు.

ప్రార్థించడమంటే యాచించడంగాదు. అదొక ఆత్మ సంరక్షణా భావం. ఈ విశాల ప్రపంచంలో నిజమైన ప్రార్థన చేసే మహాపురుషులెందరో ఉన్నారు. వారి అడుగుజాడల్లో నడచి మనంగూడ జీవితం సార్థకం చేసుకుందాం. 

## తిరుమలలో కైశికద్వాదశి
### 23-11-2015

ప్రతిసంవత్సరం కార్తికమాసంలో శుక్లద్వాదశి రోజున శ్రీవారి ఆలయంలో కైశిక ద్వాదశి ఉత్సవం జరుగుతుంది. ఆనాడు, సూర్యోదయానికి చాల ముందుగనే శ్రీవారి ఆలయంలో ఉన్న శ్రీదేవి, భూదేవి సమేతంగా శ్రీఉగ్ర శ్రీనివాసమూర్తికి అభిషేక అర్చనలు, అలంకారాలు సమర్పిస్తారు. తర్వాత తిరుమల పురవీధుల్లో ఊరేగింపు జరుగుతుంది. మళ్ళీ సూర్యోదయం కాకముందే ఈ ఉగ్ర శ్రీనివాసమూర్తి ఆలయంలో ప్రవేశిస్తారు. ఈ స్వామికి సూర్యకిరణాలు సోకితే ఉగ్రత్వం వస్తుందని అంటారు. ఈ ఒక్కరోజు మాత్రమే ఉగ్ర శ్రీనివాసమూర్తి ఆలయం వెలుపలికి ఊరేగింపుగా వస్తారు.



# సందేహాలు? సమాధానాలు!!

డా॥ చిన్నలక్ష్మి కళావతి,
గుంటూరు, 9963339301

**షోడశమహారాజుల పేర్లు తెల్పండి.**

*- మాదేటి శంకరరావు, సాలూరు*

**సమా॥** పూర్వం 16 మంది మహారాజులు మహాచక్రవర్తులై రాజ్యాన్ని ధర్మయుతంగా, పరిపాలించారు. ఆ 16 మందిని షోడశ మహారాజులని పేర్కొన్నారు. వారు 1) గయుడు 2) అంబరీషుడు 3) శశిబిందుడు 4) అనంగుడు 5) పృథువు, 6) మరుత్తు 7) సుహోత్రుడు 8) పరశురాముడు 9) శ్రీరాముడు 10) దిలీపుడు 11) నృగుడు 12) రంతిదేవుడు 13) భరతుడు 14) యయాతి 15) మాంధాత 16) భగీరథుడు. కొందరు మరుత్తుతోపాటు మరుత్వంతుడు అని చెప్పారు. వీరిని స్మరించడంవల్ల ధార్మికచింతన, కార్యనిర్వహణా దక్షత మున్నగు సద్గుణాలు వృద్ధి చెందుతాయి.

**దేవుడికి నైవేద్యం (ఆరగింపు) చేసేటప్పుడు "ఓం ప్రాణాయ స్వాహా" - అంటూ చెప్తారు కదా! ఎందుకు**

**- కుక్కడపు గోపాలకృష్ణ, తిరువూరు**

**సమా॥** దేవతలకు నైవేద్యం పెట్టేటప్పుడు - విగ్రహమూర్తిలోని పంచప్రాణాలూ ఈ ఆహారశక్తిని స్వీకరించి, తృప్తి చెంది, నైవేద్యం సమర్పించినవారిని రక్షిస్తుంటారని భావన. శరీరంలో పంచప్రాణాలున్నాయి. అవి 1) ప్రాణ 2) అపాన 3) వ్యాన 4) ఉదాన 5) సమానములు.

1) ప్రాణమంటే = చక్కగా బ్రతికింపచేసేది, మిక్కిలిగా శ్వాసాదుల్ని బయటికి వెడలించేది - అని అర్థం. హృదయం ప్రాణం యొక్క స్థానం. 2) అపానం = విసర్జన స్థానం. 3) వ్యానం = విశేషంగా బ్రతికింపచేసేది. దీనిస్థానం-శరీరమంతా. 4) ఉదానం = మాటలు మున్నగు శబ్దాల్ని పైకి తెచ్చేది. దీనిస్థానం-కంఠం. 5) సమానం = దేహంలో నెత్తురు మొదలైన వాటిల్ని పొందించేది. దీనిస్థానం-నాభి (బొడ్డు).

**ఈ శీర్షిక నిర్వహణ : డా॥ సి.కళావతిగారు గుంటూరు ఎ.సి. కళాశాలలో రీడరుగా పనిచేసి పదవీవిరమణ చేశారు. వీరు బహుగ్రంథరచయిత్రి, ఆధ్యాత్మికసాహిత్యపరిశోధకురాలు. ఉత్తమ అధ్యాపకురాలిగా అనేకమార్లు రాష్ట్రప్రభుత్వం నుండి పురస్కారాలు స్వీకరించారు.**



కనుక, ప్రాణం-హృదయంలో ఉండి గర్భంలో ఉండే అన్నం మొదలైన వాటిల్ని ప్రవేశింపచేస్తుంది. అపానం-విసర్జనను క్రిందికి పంపుతుంది. వ్యానం-శరీర మంతటా ఉండి, చెమట మొదలగు వాటిల్ని పుట్టిస్తుంది. ఉదానం - కంఠంలో ఉండి, మాటల్ని పుట్టిస్తుంది. సమానం - నాభియందుండి, అన్నం మొదలైన ఆహారపదార్థాల్ని జీర్ణింపచేస్తుంది. ఇలా శరీరం అనే యంత్రం సక్రమంగా పనిచేయటానికి పంచ ప్రాణాలు ముఖ్యమైనవి. ఇవేకాక - మరో ఐదు ప్రాణాలూ ఉన్నాయి. అవి నాగం, కూర్మం, కృకరం, దేవదత్తం, ధనంజయం అనేవి. వీటిలో నాగం - నోటిలో, కూర్మం - కన్ను తెరవడంలో, కృకరం - తుమ్మడంలో, దేవదత్తం - విజృంభణంలో, ధనంజయం - మృతశరీరాన్ని కూడా వదలకుండా శరీరమంతటా ఉంటుంది. ఇలా ఉన్నా - ప్రాణ అపానాదులైన ఐదే అత్యంత ప్రధానాలు కనుక వాటితోనే నైవేద్యం చేస్తారు. దేవతలకు స్వాహా శబ్దంతో అర్పించాలి. ఇలా అర్పించినప్పుడు దేవతలు తమ దృష్టిద్వారానే నైవేద్య సారాన్ని స్వీకరించి, తృప్తి చెందుతారు. వైదిక విధానంలో మనమందరూ కూడా



భోజనం చేసేముందు ఈ 'ప్రాణాయస్వాహా...' అనే ఐదూ చెప్తూ, మనలోపల వైశ్వానరాగ్ని రూపంలో ఉన్న భగవంతునికి 'పంచా హుతులు' సమర్పించాలి. తర్వాత భోజనం చేయడం సంప్రదాయం! భగవంతునికి ఆకలి దప్పులు లేకపోయినా భక్తిమార్గంలో దేవుణ్ణి – దేవతామూర్తిని మనవంటి వ్యక్తులుగానే భావించి, అదే సమయంలోనే మనకంటే ఉన్నతుడుగానూ నిర్ణయించి – ఈ విధంగా ఉపచారాలు చేసి, తర్వాత ఆ నైవేద్యాన్ని భగవత్ప్రసాదంగా స్వీకరించడంలో ఎంతో పవిత్రభావన ఉంది.

**షోడశ కళలు, షోడశ ఉపచారాలు ఏవేవో తెల్పండి?**

*– కె.వి.ఎం. భారతి, దాక్షారామం*

**సమా॥** భారతీయులకు తొమ్మిదిసంఖ్యవలె, షోడశ (16) సంఖ్యకూడా విశిష్టమయింది! సంభావనలలో 116, 1116, 10116 ఇలా చివర 16 సంఖ్యను చేర్చడం సంప్రదాయం. మానవజీవిత కర్మలు కూడా 16 సంఖ్యలోనే ఉన్నాయి.

అ) షోడశకళలు : చంద్రుడు మనఃకారకుడు. షోడశకళా ప్రపూర్ణుడు. చంద్రుని కళలు 16. ఇవి శుద్ధ పాడ్యమినుండి క్రమంగా పెరుగుతూ, పూర్ణిమనాటికి పూర్ణత్వం చెందుతాయి. బహుళపక్షంలో క్రమంగా తగ్గుతూ వస్తాయి. ఇవి 1) అమృత 2) మానద 3) పూష 4) తుష్టి 5) రతి 7) ధృతి 8) శశిని 9) చంద్రిక 10) కాంతి 11) జ్యోత్స్న 12)శ్రీ 13) ప్రీతి 14) అంగద 15) పూర్ణ కాగా పదహారవది అమృతకళ. ఈ కళను శివుడు తన శిరోభూషణంగా ధరించి, చంద్రశేఖరుడయ్యాడు. కార్తికపూర్ణిమనాడు శివుడు ఈ 16 వ కళాకాంతిని చంద్రునికిస్తాడనీ, అందుకే కార్తికపూర్ణిమ షోడశకళాపూర్ణ మవుతుందని పెద్దలంటారు.

ఆ) షోడశ ఉపచారాలు : భగవంతుణ్ణి అర్చామూర్తిగా ఆరాధించేటప్పుడు షోడశ (16) ఉపచారాలతో అర్చించడం సంప్రదాయం. ఉపచారం అంటే సేవ, సమ్మానం అని అర్థాలు. ఇక్కడ 16 సేవలతో భగవంతుణ్ణి పూజించాలి. అవి 1) ఆవాహనం 2) ఆసనం 3) పాద్యం 4) అర్ఘ్యం 5) ఆచమనీయం 6) అభిషేకం 7) వస్త్రం 8) యజ్ఞోపవీతం 9) గంధం 10) పుష్పం 11) ధూపం 12) దీపం 13) నైవేద్యం 14) తాంబూలం 15) ప్రదక్షిణం 16) నమస్కారం.

ఈ షోడశోపచారాలు ఆయా సంప్రదాయాల్ని బట్టి కొద్దిపాటి తేడాలతో ఉన్నాయి. కొందరు 'వాద్యం, నీరాజనం' మున్నగునవి చేరుస్తారు.

ఇవిగాక పంచోపచారాలు ఉన్నాయి. 1) స్నానం 2) పూజ 3) నైవేద్యం 4) ప్రదక్షిణం 5) నమస్కారం.

సాలగ్రామంలోనూ, స్థిరప్రతిష్ఠ నొందిన దేవతామూర్తులలోనూ ఆవాహనం, విసర్జనం (రమ్మనడం, యథాస్థానానికి వెళ్లుమని ప్రార్థించడం) తగదు. ఈ రెంటిలో దేవతలు నిత్యమూ సన్నిహితులై ఉంటారు. అలాంటిచోట్ల ఆవాహనం, ఆసనం అవసరం లేదు. 'పాద్యం' తో ప్రారంభించి, గంధం తర్వాత – అక్షతలు, తాంబూలం పిదప కర్పూరనీరాజనం చేర్చుకోవాలి. 

## నగరి కరియమాణిక్యస్వామివారి పవిత్రోత్సవ క్రమము

| | | | |
|---|---|---|---|
| 24-11-2015 | మంగళవారము | -- | అంకురార్పణము (రాత్రి) |
| 25-11-2015 | బుధవారము | పవిత్రోత్సవము | కార్తికమాసంలో పూర్ణిమకు జరుగును. |

## శ్రీ కపిలేశ్వరస్వామివారి లక్షబిల్వార్చన

| | | |
|---|---|---|
| 28-11-2015 | శనివారము | కార్తికమాసమున ఆర్ద్రానక్షత్రమున జరుగును |



డా॥అప్పజోడు వేంకటసుబ్బయ్య,
9014878108




**ఇంద్రియాణి పురా జిత్వా
జితం త్రిభువనం త్వయా
స్మరద్భి రివ తద్ వైరం
ఇంద్రియై రేవ నిర్జితః ॥**

'ఇదివరకు నీవు నీ ఇంద్రియాల్ని జయించావు. ముల్లోకాలు నీచేత జయింపబడ్డాయి. నీ ఇంద్రియాలు ఆ వైరాన్ని గుర్తుంచుకొన్నట్లున్నాయి. ఇప్పుడు వాటిచేతనే నీవు ఓడింపబడ్డావు' - ఇవి రణభూమిలో రావణాసురుడి మృతదేహం మీదబడి మండోదరీదేవి అన్నమాటలు. 'నాథా! నీ దెబ్బకు దేవేంద్రుడే భయపడుతాడే, యమధర్మరాజే నీ వెదురుపడితే గడగడ వణుకుతాడే, ముల్లోకాలను అవలీలగా జయించావే, అలాంటి నీకు మరణమేమిటి?' అని ఆవేదనతో, ఆశ్చర్యంతో, నైరాశ్యంతో అన్నమాటలు. అందరు ఆలోచించుకోదగిన మాటలు.

మనిషికి కళ్ళు, చెవులు, ముక్కు, నాలుక, చర్మం జ్ఞానేంద్రియాలు. ఇవి ప్రకృతిలో ఏది ఏమిటో తెలుసుకోవటానికి ఉపయోగపడే సాధనాలు. కాళ్ళు, చేతులు కర్మేంద్రియాలు, ఇవి కోరుకొన్నదానికోసం కృషి చేసే సాధనాలు.

కంటికి అందం అంటే అమిత ఇష్టం. చెవికి శ్రుతి లయలంటే చాలా ప్రీతి. ముక్కుకు సువాసన అంటే మక్కువ. రసనకు రుచి అంటే లాలస. చర్మానికి మెత్తదనం ఇష్టం. కాళ్లు పొమ్మన్నచోటికి పోతాయి. చేతులు చెప్పిన పని చేస్తాయి.

అందాన్ని చూడటం తప్పు కాదు. ఆనందించటం కూడా తప్పు కాదు. శ్రావ్యమైన సంగీతాన్ని వినటం గాని, పరిమళాన్ని ఆఘ్రాణించటం కాని, ఇష్టమైన చోటికి వెళ్ళటం గాని, ఇష్టమైన పనులు చేసుకోవటం గాని తప్పేమీ కాదు.

అలా జరగాలంటే ఇంద్రియాలు పూర్తిగా మన అదుపులో ఉండాలి. ఇంద్రియాల్ని అదుపులో ఉంచటం అంటే మనిషి తన మనస్సును తాను అదుపులో ఉంచటం. ఇంద్రియాల్ని జయించటం అంటే మనిషి తన మనస్సును తాను జయించటం. మనిషి మనస్సును జయించటం అంటే ఈ జగత్తునే జయించటం.

కాని, అది అంత సులభం కాదు. ఎందుకంటే కదలిక మనస్సు స్వభావం. వీచే గాలిని బంధించవచ్చు. పారే నీటిని నిరోధించవచ్చు. ప్రసరించే కాంతిని

**అనుభవ పరంపరే మానవ జీవితం. ఆనందానుభవమే ఐహికం. అయితే, ఈ ఆనందానుభవం ఔచిత్యాన్ని మీరకూడదు. పరిమితిని దాటకూడదు. ధర్మాన్ని ఉల్లంఘించకూడదు.**



## శ్రీవారికి పుష్పయాగం
### 18-11-2015

**ప్రతి సంవత్సరం కార్తికమాసంలో శ్రవణ నక్షత్రం రోజున శ్రీదేవి భూదేవి సమేతంగా శ్రీమలయప్ప స్వామివారికి "పుష్పయాగం" జరుగుతుంది.**

**పుష్పయాగం జరిగే రోజు యథాక్రమంగా రెండు అర్చనలు రెండు నివేదనలు పూర్తి అయిన తర్వాత శ్రీదేవి, భూదేవి సమేతంగా శ్రీమలయప్పస్వామి కల్యాణమండపానికి వేంచేస్తారు. హోమాలు, స్నపన తిరుమంజనాదులు నిర్వహిస్తారు.**

**పిదప ఆ మధ్యాహ్నం శ్రీస్వామివారికి వివిధ రకాలయిన పుష్పాలతో పుష్పార్చన జరుగుతుంది. ఈ పుష్పాలు శ్రీవారి హృదయం వరకు రాగానే వీటిని తొలగిస్తారు. మళ్లీ పుష్పార్చన జరుగుతుంది. ఇలా 20 మార్లు జరుగుతుంది. పిదప ఘనంగా హారతి సమర్పిస్తారు.**

**ఆర్జిత రుసుమును చెల్లించిన భక్తులు కూడ ఈ పుష్పయాగంలో పాల్గొనవచ్చు. పుష్పయాగంలో పాల్గొన్న భక్తులకు పూర్వజన్మల వాసనలు తొలగడమేగాక,సర్వరోగాలు నశిస్తాయి. తద్వారా సుఖశాంతులతో ప్రశాంతంగా జీవనం సాగుతుంది.**

**మనస్సును జయిస్తే మనిషి మహాత్ముడవుతాడు. మనస్సుకు వశమైతే అతడు పతనమౌతాడు. పశువౌతాడు.**

అద్దుకోవచ్చు. ధ్వనించే శబ్దాన్ని ఆపవచ్చు. వ్యాపించే వాసనను కప్పివేయవచ్చు. కాని, మనిషి మనస్సును మాత్రం కదలకుండా నిలుపలేం. అందుకు ఎంతో సాధన కావాలి. ఎంతో తపస్సు చెయ్యాలి. అలా చేసినా, అది చాలామంది విషయంలో మళ్ళీ మళ్ళీ చలిస్తూనే ఉంటుంది. ఆకర్షించిన ప్రతిదానినీ అనుభవించాలని ఆరాటపడుతూ ఉంటుంది. కోరుకున్న ప్రతిదానికోసమూ పరుగులు తీస్తూ ఉంటుంది. పదేపదే ధర్మాన్ని తప్పుతూ ఉంటుంది. మనిషిని పతనం చేస్తూ ఉంటుంది.

రావణుడు జీవితంలో మహోగ్రమైన తపస్సు చేశాడు. ఇంద్రియాల్ని జయించాడు. మహాశక్తిమంతుడు అయ్యాడు. అన్ని లోకాలను జయించాడు. అతని పేరు చెపితే ఇంద్రుడు భయపడిన మాట నిజమే. అతడెదురుపడితే యముడు గడగడలాడిన మాట కూడా నిజమే. కాని ఏం లాభం? రావణుడు ఇంద్రియాల్ని పూర్తిగా జయించలేక పోయాడు. ఇంద్రియాలకు వశమయ్యే గుణం అతనిలో మిగిలి ఉంది. అందుకే సీతా సౌందర్యాన్ని గూర్చి వినగానే అతని చెవులు అదుపు తప్పాయి. ధర్మాన్ని తృణీకరించాయి. ఆ మహాసాధ్వి సౌందర్యాన్ని చూడగానే అతని కళ్ళు అదుపు తప్పాయి. ధర్మాన్ని కాలదన్నాయి. ఫలితం – సీతాపహరణం; రావణుని నైతిక పతనం; అతని ఘోర మరణం.

అందుకే మండోదరి అంది – ఇంద్రియాల్ని జయించిన రోజు నీవు ముల్లోకాలను జయించావనీ, ఆ ఇంద్రియాలకు వశమై ఇప్పుడు ఘోరమరణం పాలయ్యావనీ.

మండోదరి మాటలు రావణునికే కాదు. లోకంలో ప్రతి మనిషికి అన్వయిస్తాయి. మనస్సును జయించటానికి మార్గదర్శకంగా నిలుస్తాయి.



# భక్తిమార్గం యోగమార్గం

కె. యజ్ఞన్న

ఒకసారి నారదమహర్షి వైకుంఠానికి వెళ్లాడు. అక్కడ కొండపై తపస్సులో మునిగిన ఒక ముని కనిపించాడు. ఆ ముని కళ్లు తెరిచి నారదుణ్ణి చూసి, "ఓ నారదా! విష్ణు సందర్శనానికి మీరు వైకుంఠానికి వెళ్తున్నారు గదా! నేను ఎన్నో ఏళ్ల బట్టి కఠోర తపస్సు చేస్తున్నాను. కాని నాకింతవరకు విష్ణుసాక్షాత్కారం సిద్ధించలేదు. నాకు ఎప్పుడు ముక్తి లభిస్తుందో, ఎన్నడు విష్ణుమూర్తిని చూస్తానో ఆయన్ని కనుక్కొని చెప్పండి. మీకు పుణ్యముంటుంది" అన్నాడు. 'అలాగే' అంటూ నారదుడు ముందుకు సాగాడు.

ఒకచోట ఒక వైష్ణవభక్తుడు హరిని పొగడుతూ పాటలుపాడుతూ, నాట్యం చేస్తున్నాడు. అతను కూడా నారదుణ్ణి చూసి, 'ఓ నారదా! మీరు విష్ణు దర్శనానికి



వెళ్తున్నారు. నేను ఎప్పుడు ఆయన్ని చూడగల్గుతానో కాస్త కనుక్కోండి" అన్నాడు. సరేనంటూ నారదుడు వైకుంఠానికి వెళ్ళిపోయాడు.

తిరిగి భూమికి వస్తూ నారదుడు మొదట యోగిని కలుసుకొన్నాడు. "నేను విష్ణువును అడిగాను మరో ఆరు జన్మల తర్వాత నీకు విష్ణుసాయుజ్యం సాధ్యమవుతుంది" అని చెప్పాడు.

దానితో ఆ యోగి ఎంతో దుఃఖించాడు. "ఎంత కఠిన నియమాలతో తపస్సు చేశాను! ఎంతగా శ్రమించాను! విష్ణుమూర్తి నాపట్ల ఎంతో కఠినంగా ఉన్నారు" అని వాపోయాడు ఆ ముని.

తర్వాత నారదుడు భక్తుని వద్దకు వెళ్లాడు. "ఒక లక్షజన్మల పిమ్మట నీకు విష్ణు సాక్షాత్కారం కలుగుతుంది" అని అన్నాడు నారదుడు. ఆ భక్తుడు ఒక్కసారి ఆనంద తన్మయం చెంది-- "ఓ! లక్ష జన్మల తర్వాత హరిని నేను చూడగల్గుతాను. ఆయన ఎంతటి దయామయుడు!" అని అంటూ ఆనందోత్సాహంతో నాట్యం చేయసాగాడు. అప్పుడు నారదుడు అతనితో అన్నాడు "నీకు సిద్ధి లభించినట్లే. నేడే నువ్వు విష్ణువును దర్శిస్తావు."

భక్తిమార్గమే ఉత్తమమైనదని ఈ కథలో నీతి. అయితే భగవంతుని చేరడానికి యోగమార్గం ఒకటి ఉందని, ఈ జన్మలోనే అది సాధ్యం అని ఈ కథ తెలియజేస్తుంది. అనుపమ భక్తికి, విశ్వాసానికి, ఓర్పుకు, మనోస్థైర్యానికి ఈ కథలో ప్రాధాన్యం ఇవ్వబడింది. మనం లక్ష జన్మల తర్వాత కాకుండా, ఈ జన్మలోనే విష్ణు సాయుజ్యం (ముక్తి) పొందడానికి ప్రగాఢ ప్రయత్నం చేయాలి.






# దివ్యసాక్షాత్కారం

**చిలుకూరి రామసత్యనారాయణశర్మ,** మహబూబ్‌నగర్

వేడుకుంటే చాలు...
వేదనంతా తీరు....

– అన్నారు పెద్దలు. పిలిస్తే పలికే దేవుడు ఏడుకొండలవాడు. ఆదుకోమంటే ఆపద నుండి చేదుకునేవాడు శ్రీనివాసుడు.

నా జీవితంలో 2009వ సంవత్సరంలో జరిగింది ఈ సంఘటన. కుటుంబ సమేతంగా తిరుమల శ్రీవారిని దర్శించు కోవాలని మొక్కుకున్నాము. అందరం తిరుపతికి రైల్లో ప్రయాణ మయ్యాం. మా పాప పేరు ఉమాకామేశ్వరి. ఎందుకో తను నీరసంగా ఉన్నట్లు అనిపించింది. ప్రయాణం కదా అనుకున్నాను. భోజనాల వేళ పాప పెద్దగా ఏమీ తినలేదు. కొత్త చోటుకి వెళ్తున్నామన్న ఉత్సాహం పాపలో కనిపించలేదు.

తెల్లవారింది.

తిరుపతిలో రైలు దిగాము. నాలుగడుగులు వేశామో లేదో పాపకు వాంతులు ప్రారంభం అయ్యాయి. పాపముఖం కడిగి రైలుస్టేషన్లోనే కూర్చున్నాము. మా దంపతులిద్దరికీ విపరీతంగా భయం వేసింది. పాపను పరీక్షగా చూశాము. కామెర్లు అన్న అనుమానం కలిగింది. 'శ్రీనివాసా' అనుకున్నాను.

కొత్త ఊరు. బంధువులు, స్నేహితులు లేరు. స్వామి దర్శనం ఆ రోజే చేసుకోవాలి. వెంటనే తిరుమలకు బయలుదేరకపోతే స్వామిదర్శనం కాదు. బయలుదేరాలంటే పాపకు అనారోగ్యంగా ఉంది.

వైద్యుడి వద్దకు వెళ్ళాలా? తిరుమల బస్సు ఎక్కాలా? అన్న సందేహం. వైద్యులకు వైద్యుడు, ఆపదలో ఆదుకునేవాడు, ప్రాణాన్ని నిలబెట్టేవాడు ఆ శ్రీనివాసుడే! ఆయన దర్శనం కోసమే వచ్చాం. కాపాడినా? కాదన్నా ఆయనే! ఆయన దయ లేకపోతే ఎంత పెద్ద వైద్యుడూ ఏమీ చేయలేడు అనుకున్నాను. పాప కేసి చూశాము. మరింత నీరసంగా కనిపిస్తోంది.

తలనీలాలు సమర్పించాం. దర్శనం కోసం క్యూలైన్లో సాగుతున్నాం. ఎంత ప్రయత్నించినా పాప ఏమీ తినలేదు. నీరసం ఎక్కువైంది. పాపను ఎత్తుకున్నాను. నా భుజం మీద తల వేలాడేస్తోంది.

"అమ్మా! గోవిందా... గోవిందా... అనుకో తల్లీ!" అని చెప్పాను. నాకు ఏడుపు ఆగడం లేదు. బలవంతంగా అణచుకున్నాను. పాప నీరసంగా 'గోవింద' నామస్మరణ చేస్తోంది.





పాపను వాళ్ల అమ్మ అందుకుంది.

అంతలో ఆనందనిలయంలోకి ప్రవేశించాము. కొద్ది దూరంలో శ్రీవారి దివ్యమంగళస్వరూపం. క్షణమాత్రం దర్శిస్తే చాలని కలలుగనే రూపం. మహర్షులు, మహాత్ములు దర్శించాలని తపించే పరబ్రహ్మ.

**'స్వామీ! ఆపదమొక్కులవాడా! కాపాడు తండ్రీ! నీ మీద నమ్మకంతో, భక్తితో, నీ దర్శనం కోరి వచ్చాము. నా కూతుర్ని కాపాడే భారం నీది" అని మనసులో స్వామిని తదేకంగా ప్రార్థించసాగాను.**

"భారంనాదన్నావు. ఎందుకు భయపడుతున్నావు?" అంటూ నాకు వినిపించింది. అన్నది ఎవరా అని అటూ ఇటూ చూశాను. అందరూ తన్మయంగా స్వామినే చూస్తున్నారు. ఆ కంఠస్వరం మనిషి కంఠంలా లేదు మేఘగర్జనలా ఉంది.

"ఏమండీ! మనమ్మాయిని ఎవరో ఎత్తుకుని స్వామిని చూపిస్తున్నారు చూడండి!" అంది నా భార్య. నా భార్య కేసి చూశాను. పాప ఆమె భుజం మీదే ఉంది.

స్వామికి మరింత దగ్గరగా వచ్చాం. తనివితీరా స్వామివారి మంగళస్వరూపాన్ని దర్శించుకున్నాం. ఆ దివ్య సాక్షాత్కారానికి క్షణం మైమరచాం.

ఆనందం నిండిన మనస్సుతో ఆనందనిలయం దాటి వచ్చాం. స్వామివారి ప్రసాదమైన పెరుగన్నం తీసుకున్నాం.

పాపను కూర్చోపెట్టి ప్రసాదం ఒక చెంచా పాపకు తినిపించింది నా భార్య.

పాపముఖంలో నవ్వు కనిపించింది. గత ఇరవై నాలుగు గంటల్లో పాపముఖంలో నవ్వుచూడడం అదే మొదటిసారి.

ప్రసాదం మొత్తం పాపే తిన్నది. క్షణాల్లో పాపలో అంతవరకు ఉన్న నీరసం ఛాయలుపోయాయి. గుడి ఆవరణలోనే ఉరుకులు పరుగులు తీసింది.

అరగంటక్రితం వరకు బ్రతుకుతుందా అనుకున్న పాపలో అంతఉత్సాహం చూసి మేము నమ్మలేక పోయాం.

అంతా! ఆ ఏడుకొండలవాని దయ. ఆయన అనుకుంటే సాధ్యం కానిది ఏముంది? భారం నీదే! అంటే భగవంతుడు కాపాడకుండా ఎలా ఉంటాడు.

మనస్సులోనే స్వామివారిని మరీ మరీ దర్శించుకున్నాము. ఆలయము ముందు, గొల్లమండపం దగ్గర సాష్టాంగ నమస్కారాలు అర్పించుకుని మాటల్లో చెప్పలేని అనుభూతితో తిరుగు ప్రయాణమయ్యాం.

## ఆన్‌లైన్‌లో వసతిగదులు...

**తిరుపతిలోని మాధవం అతిథిగృహం, శ్రీనివాసం వసతి సముదాయాలలో భక్తులు ఆన్‌లైన్ ద్వారా ముందస్తుగా 100 గదులు పొందవచ్చు.**

**వాటి వివరాలు**

| గది వివరాలు | ధర | ప్రదేశం | ఆన్‌లైన్ రిజర్వేషన్‌కి కేటాయించిన గదులసంఖ్య |
|---|---|---|---|
| 1. సాధారణ గది | 200/- | శ్రీనివాసం కాంప్లెక్స్ | 50 |
| 2. సాధారణ ఏ.సి. గది | 400/- | శ్రీనివాసం కాంప్లెక్స్ | 20 |
| 3. స్పెషల్ డీలక్స్ గది | 600/- | శ్రీనివాసం కాంప్లెక్స్ | 05 |
| 4. ఏ.సి. సూట్ | 800/- | మాధవం గెస్ట్‌హౌస్ | 20 |
| 5. డీలక్స్ ఏ.సి. సూట్ | 1000/- | మాధవం గెస్ట్‌హౌస్ | 05 |
| మొత్తం | | | 100 |

- ఉపకార్యనిర్వహణాధికారి
(శ్రీనివాసం)








# ప్రధాన సంపాదక కార్యాలయం
# సప్తగిరి మాసపత్రిక చందా వివరాలు

- తిరుమల తిరుపతి దేవస్థానం ఆరు భాషలలో సప్తగిరి మాసపత్రికను వెలువరిస్తున్నది.
- తెలుగు, తమిళ, కన్నడ, ఆంగ్ల, హిందీ, సంస్కృత భాషలలో విడివిడిగా సప్తగిరి మాసపత్రిక వెలువడుతున్నది.
- సప్తగిరి మాసపత్రిక సంవత్సర చందా రూ. 60/-లు. జీవిత చందా రూ. 500/-లు.
- సంస్కృత సప్తగిరి మాసపత్రికకు సంవత్సర చందా రూ. 60/-లు. ప్రస్తుతం జీవితచందా సౌకర్యం లేదు.
- విదేశాలకు సప్తగిరి సంవత్సర చందా రూ. 850/-లు. జీవితచందా సౌకర్యం లేదు.
- సప్తగిరి మాసపత్రికను (ఆరు భాషలు) అంతర్జాలంలో (ఇంటర్‌నెట్) చదువుకోవడానికి, డౌన్‌లోడ్ చేసుకోవడానికి వీలు కల్పించబడింది.
- పాఠకులు తమ సూచనలను సలహాలను పంపితే ఆచరణ సాధ్యమైన వాటిని స్వీకరించి అమలు చేస్తాము. శ్రీవారి ధార్మికవాణిని మీరు చదివి, పదిమందిచేత చదివించండి.

వెబ్‌సైట్: **www.tirumala.org. (or) www.tirupati.org**

- సప్తగిరి మాసపత్రికకు చందాలను డి.డి. / ఎం.ఓ. / ఇ.ఎం.ఓ. ద్వారా చెల్లించవచ్చును. **వీటితోపాటు ప్రస్తుతం ఆన్‌లైన్ ద్వారా కూడా చందాలు స్వీకరిస్తాము.**

వెబ్‌సైట్ : **www.tirumala.org. (or) www.tirupati.org**

- తిరుమల తిరుపతి దేవస్థానముల ప్రచురణల విక్రయకేంద్రాల్లో, 'సప్తగిరి' ప్రధాన సంపాదక కార్యాలయ పనివేళల్లో ప్రత్యక్షంగా చందాలు చెల్లించవచ్చును.

**వివరాలకు:-**

**ప్రధాన సంపాదకులు,**
**ప్రధాన సంపాదక కార్యాలయం,**
**టి.టి.డి. ప్రెస్ కాంపౌండ్, కె.టి.రోడ్డు,**
**తిరుపతి - 517 507.**
**ఫోన్ నెం.0877 - 2264543.**

**తిరుమల తిరుపతి దేవస్థానములు**

**"సప్తగిరి" మాసపత్రికను చదువుకోవడానికి,**
**డౌన్‌లోడ్ చేసుకోవడానికి**

**వెబ్‌సైట్ www.tirumala.org. (or) www.tirupati.org వెళ్ళి**
**Latest updates click చేయాలి,**

**చేసిన తర్వాత కావలసిన భాషలో**
**సప్తగిరిని ఎంపిక చేసుకోవచ్చు.**





# విష్ణుసహస్రనామం

ఎల్. ప్రపుల్లచంద్ర, ధర్మవరం

దుష్టశిక్షణ-శిష్టరక్షణ కోసం శ్రీమహావిష్ణువు దశావతారములలో అవతరించాడు. దుష్టులను శిక్షించి తనభక్తులను ఆదుకున్నాడు. తద్వారా ఈ లోకానికి శాంతిని ప్రసాదించాడు. విశ్వస్వరూపుని ఈ గుణగణాలను కీర్తిస్తూ శ్రీవిష్ణసహస్రనామంలో వివరించడం జరిగింది. శ్రీమహావిష్ణువు సకలసృష్టికి స్థితిలయకారుడిగా ఏకైక పరమాత్ముడిగా నిలిచాడు.

అందుకు మనం ఆయనను నిత్యం భక్తిశ్రద్ధలతో ఆరాధించాలి. మనసారా ధ్యానించాలి. శ్రీహరి నామాలు ఎన్నో ఉన్నాయి. శ్రీమహావిష్ణువు దశావతారముల వైశిష్ట్యం గురించి శ్రీ విష్ణుసహస్రనామంలో విపులంగా వివరించారు.

విష్ణుభక్తులకు ఈ స్తోత్రపఠనం వలన ఎన్నో ప్రయోజనాలు ఉన్నాయి. సదా విష్ణుస్మరామి, ఓం నమో నారాయణాయ అంటూ నిత్యం స్మరిస్తారు. ఓం విష్ణురూపాయ నమః అని ప్రార్థిస్తారు. మనం ప్రతినిత్యం భక్తిశ్రద్ధలతో శ్రీవిష్ణుసహస్రనామం చదవడం ఎంతో అవసరం.

ముఖ్యంగా విష్ణు సహస్రనామంలో "శ్రీరామ రామ రామేతి రమే రామేమనోరమే సహస్రనామ తత్తుల్యం రామనామ వరాననే" అనే శ్లోకం మూడుసార్లు పఠించే నియమం ఆచరణలో ఉంది.

**విష్ణుసహస్రనామం నిత్యంక్రమం తప్పకుండా భక్తిశ్రద్ధలతో చదవడంవలన సర్వకార్యాలు సిద్ధిస్తాయి. శుభఫలాలు చేకూరుతాయి. కష్టాలు తొలిగిపోతాయి. సిరులు సౌభాగ్యాలు సమృద్ధిగా లభిస్తాయి. శ్రీమహాలక్ష్మి అనుగ్రహం లభిస్తుంది. శత్రువులు నశిస్తారు. విద్యార్థులు సైతం ఈ స్తోత్రం పఠిస్తే విజయం సాధిస్తారు.**

శ్రీవిష్ణుసహస్రనామంలో సైతం శ్రీరామనామమహిమ గురించి విపులీకరించారంటే శ్రీరామనామ మహిమ ఎంత గొప్పదో మనం ఊహించవచ్చు.

శ్రీమన్నారాయణుని దివ్యఅవతారములను కీర్తించే గుణగణాలు శ్రీవిష్ణుసహస్రనామంలో కనిపిస్తాయి.

దశావతారముల సంపూర్ణ సమగ్రరూపకల్పనగా మనకు ప్రత్యక్షంగా కనిపించే అనుభూతిని శ్రీవిష్ణుసహస్రనామ స్మరణ ద్వారా మనకు లభిస్తుంది. భీష్మ ఉవాచగా ప్రారంభమయ్యేటటువంటి శ్రీవిష్ణు సహస్రనామం విశ్వం పదంతోనే ప్రారంభం కావడం విశేషం. కాగా విశ్వశాంతికి సైతం ఈ స్తోత్రం పఠనం ఎంతో మంచిదంటారు.

"విశ్వం విష్ణు విషట్కారో...." అంటూ ఆరంభం అవుతుంది.







సకలలోక రక్షకుడు అయినటువంటి శ్రీమహావిష్ణువు కలియుగప్రత్యక్ష దైవంగా నిలిచిన అంశాన్ని శ్రీవిష్ణు సహస్రనామంలో వివరించారు.

అందుకే దీనిని నిత్యం పఠించడం వలన సకల సౌభాగ్యాలు సంప్రాప్తిస్తాయనడంలో ఎటువంటి సందేహంలేదు.

కురుక్షేత్ర సంగ్రామంలో నారాయణాంశ అయిన అర్జునుడు ధర్మమార్గాన నిలిచి విజేత అయ్యాడు. కానీ అధర్మం వైపు యుద్ధం చేసి వీరమరణం పొందిన భీష్మాచార్యుడు ఆత్మజ్ఞాని అయ్యాడు. భీష్ముడు విరాట్‌స్వరూపుని పరిపూర్ణతత్వం గ్రహించాడు. అంపశయ్య నుండే భీష్మాచార్యుడు అర్జునాది మానవాళికంతటికీ విష్ణుసహస్రనామం ద్వారా ఆత్మసందేశం అందించి ఆదర్శప్రాయుడయ్యాడు.

భీష్ముడు ఆత్మజ్ఞాని. కనుకనే ఆ మహాపురుషుని వ్యక్తిత్వం గ్రహించిన శ్రీకృష్ణుడు గీత బోధలో అర్జునుడికి ఈ విషయం తెలియజేశాడు.

సాక్షాత్తు శ్రీకృష్ణుడే భీష్మాచార్యుని వ్యక్తిత్వం ఔన్నత్యం గుర్తించాడంటే భీష్ముడెంతటి పుణ్యాత్ముడో మనం ఇట్టే గ్రహించవచ్చును.

అటువంటి మహనీయులు సైతం పారాయణం చేసిన శ్రీవిష్ణుసహస్రనామం పఠనం వలన కార్యసిద్ధి. ఆరోగ్యసిద్ధి, పుణ్యఫలం, సౌభాగ్యసిద్ధి సంప్రాప్తిస్తాయి.

శ్రీవిష్ణుసహస్రనామం గురించి పవిత్ర వేదశాస్త్రాలలో సైతం వివరించారు. సకలశుభాలు చేకూర్చే శ్రీవిష్ణుసహస్రనామం ఎంతో మధురమైనది, అని ప్రతి ఒక్కరూ గ్రహించాలి. నిత్యం ఆ నామపఠనం చేయాలి. 

## నారాయణవనం శ్రీ పద్మావతీ సమేత శ్రీ కల్యాణ వేంకటేశ్వరస్వామివారి (తెప్ప) ప్లవోత్సవ క్రమము

| | | | |
|---|---|---|---|
| **21-11-2015** | శనివారము | శ్రీ రామస్వామివారికి | |
| **22-11-2015** | ఆదివారము | శ్రీ కృష్ణస్వామివారికి, శ్రీ ఆండాళ్ అమ్మవారికి | |
| **23-11-2015** | సోమవారము | శ్రీ కల్యాణ వేంకటేశ్వరస్వామివారికి | కార్తిక పూర్ణిమకు |
| **24-11-2015** | మంగళవారము | శ్రీ కల్యాణ వేంకటేశ్వరస్వామివారికి | జరుగును. |
| **25-11-2015** | బుధవారము | శ్రీ కల్యాణ వేంకటేశ్వరస్వామివారికి | |

# శ్రీవారి సాలకట్ల బ్రహ్మోత్సవ వైభవ మాలిక

ధ్వజారోహణ దృశ్యం



ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వం తరపున 16-9-2015 శ్రీవారికి పట్టువస్త్రాలు సమర్పిస్తున్న ముఖ్యమంత్రి శ్రీ నారా చంద్రబాబునాయుడుగారు



17-9-2015 శ్రీవారి దర్శనానికై విచ్చేసిన ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర గవర్నరు శ్రీ ఇ.ఎస్.ఎల్. నరసింహన్‌గారు



ధ్వజచిత్రపటాన్ని మోస్తున్న తి.తి.దే. అధ్యక్షులు, కార్యనిర్వహణాధికారి



పెద్దశేష వాహనంపై శ్రీవారు



చిన్నశేష వాహనంపై శ్రీవారు



సింహ వాహనంపై విహరిస్తున్న శ్రీవారు



హంస వాహనంపై శ్రీవారు



గరుడగమనుడైన శ్రీవారు



కల్పవృక్ష వాహనంపై శ్రీవారు


గజవాహనంపై ఊరేగిన శ్రీవారు


శ్రీరామ అలంకారంలో హనుమంత వాహనంపై శ్రీవారు


స్వర్ణకాంతులతో స్వర్ణరథోత్సవం


సూర్యప్రభవాహనంపై శ్రీవారు


స్వామివారికి స్నపన తిరుమంజనం


చంద్రప్రభ వాహనంపై శ్రీవారు


భక్తుల ఆనందోత్సవం - స్వామి రథోత్సవం


స్వామిపుష్కరిణిలో చక్రస్నానం





తందనాన.... భళాతందనాన..



రాధాగోపికల బృందగానం



దేవతారూపాలలో భక్తులు



అన్నమయ్య సంకీర్తనా వాహిని



కోలాట కోలాహలంలో మహిళలు



ఉత్తరాదివారి నాట్యవిన్యాసం



దక్షిణాదివారి దరువుమేళం






# ఆదికవి వాల్మీకి

జె. శ్యామసుందరం, శ్రీకాకుళం

ఆదికవి వాల్మీకి అయితే ఆదికావ్యం శ్రీమద్రామాయణం అయింది. వేదవేద్యుడైన శ్రీమన్నారాయణుడు త్రేతాయుగమున శ్రీరామచంద్రుడుగా అవతరించాడు. వేదం రామచరిత రామాయణంగా ఉద్భవించింది. దానినే సమకాలికుడైన వాల్మీకిమహర్షి పౌలస్త్యవధ అనే పేరుతో రచించాడు.

మహర్షి చిరకాలం తపస్సుచేసి సమాధిస్థితుడై ఉండగా ఆతనిపై పుట్ట ఏర్పడింది. మనభాగ్యంచేత దానినుండి ఆయన వాల్మీకియై వెలువడి పురుషార్థసార్థకంగా పవిత్రమైన రామచరితను రచించి మనకు కటాక్షించడం జరిగింది.

**ఇహపరసాధనమైన ఆ రామచరిత్రను సంస్కృతమున, వాల్మీకి సృజించాడు. ఈ కావ్యం సకల దేశభాషల్లో, విదేశీయభాషల్లో ఎందరెందరో మహాకవులచే వ్రాయబడింది. రాముడే ఏకైక ఆరాధ్యదైవమైనాడు. ఎందరికో స్ఫూర్తిదాయకంగానిల్చిన రామచరితంవల్ల వాల్మీకి జనవంద్యుడైనాడు.**



రామాయణాన్ని ఎందరో భక్తకవులు గద్యాలు, పద్యాలు, చంపువులు, గేయాలు, రూపకాలుగా రచించారు. రచిస్తున్నారు. భాసుని నాటకాలకు రామచరిత ఊతమైంది. భవభూతి ఉత్తరరామచరిత్ర లోకప్రసిద్ధమైంది. భోజుడు రామాయణాన్ని చంపువుగా రచించాడు. ఇంకా ఎందరెందరో సంస్కృతాంధ్రకవులకు రామాయణం ఎన్నెన్నోవిధాలుగా మార్గదర్శకమైంది.

హనుమత్సందేశాన్ని మనస్సులోనిలుపుకొని కాళిదాసు మేఘసందేశాన్ని వ్రాశాడు. ఇదే వరవడితో ఎందరెందరో కవులు, పక్షులు-హంసలు-చిలుకలు-కోకిలలు మొదలైనవాటిని వార్తాహరులుగా చేసికొన్నారు. జటాయువు-సంపాతి,సీతమ్మ వార్తను రామునికి తెలిపి ఊరట కలిగించాయి. రామునిసేవను ఇలా వాగ్రూపం చేశాయి.

వాల్మీకికి రామాయణప్రేరణకు హేతువు: అలనాటి తొలిప్రొద్దున శిష్యుడైన భరద్వాజునితో కలిసి వాల్మీకి తమసానదీ తీరానికి వెళ్ళి స్నానసంధ్యాదులు ముగించుకొన్నాడు. వస్తున్నదారిలో ఒక చెట్టుమీద క్రౌంచమిథునం కనిపించింది. అదే సమయంలో కిరాతుడొకడు తనబాణంతో మగపక్షిని నేలపడగొట్టాడు. జంటను బాసిన ఆ పక్షి దుఃఖము వాల్మీకిని బాధించింది. ఆ కిరాతునిపై కోపమూ, క్రౌంచిపై జాలీ కలిగాయి. అప్పుడు అతని ముఖమునుండి **"మానిషాద ప్రతిష్ఠాత్వమగమశ్శాశ్వతీ స్సమాః యత్క్రౌంచ మిథునాదేక మవధీః కామమోహితమ్"** అనే శ్లోకం వెలువడింది. శోకము శ్లోకంగా పరిణమించుట విశేషించి ఇదివరకు ఇటువంటి ఛందోబద్ధమైన శ్లోకం వెలువడకుండుట ఆశ్చర్యం కలిగించింది. ఆలోచించినకొద్దీ విచిత్రార్థపదసమన్వితమై తోచింది.

# గోదాదేవి



గోదాదేవీ! శ్రీభూదేవీ!
గోవిందుని వరియించిన
పగడాల దీవీ...
పరువాల తావీ...

వేసికొన్న మాలనే
విష్ణునకిచ్చావు
ప్రేమ యెట్టిదో! స్వామికి
వెంటనే నచ్చావు
ఆముక్తమాల్యద వాడనిది
అమ్మా! అది నీకీర్తిని పాడినది. ॥పల్లవి॥

తులసిమొక్క చెంతనే
వెలసినావు తల్లీ!
పాశురమై పాడినావు
భవ్యరాగవల్లీ!
అమర తిరుప్పావై - భక్తనిధి...
ఆండాళూ! నీకథయే జీవనది. ॥పల్లవి॥

రసరాజు,
సెల్ : 9440488659

ఈ శ్లోకం జంటను బాసిన పక్షి జాలి కరుణను వ్యక్తం చేస్తున్నది. ఈ కరుణరసమే ప్రధానమై మునుముందుగ రామాయణకావ్యంలో నవరసములుగా పరిణతి చెందింది.

తన ముఖంనుండి వెలువడిన అబ్బురమైన ఆ శ్లోక తాత్పర్యాన్ని గురించి చింతిస్తూ వాల్మీకి తన ఆశ్రమానికి చేరుకున్నాడు. అక్కడ బ్రహ్మ సాక్షాత్కరించి ఇహపరసాధనం, జగత్కల్యాణదాయకమైన రామచరిత్రను వ్రాయుమని అనుజ్ఞనిచ్చి అంతర్ధానమైనాడు. నారదుడు సంగ్రహంగా రామచరిత్రనుపదేశించి ఆచంద్రార్కం స్వామి చరిత్రతోపాటు వాల్మీకియశస్సు నలుదిశలా వ్యాపిస్తుందని ప్రోత్సహించి వెళ్ళాడు. రామాయణ కల్పవృక్షకవితాశాఖలతో రామాయణం జగన్మోహనంగా, జగద్ధితంగా గానం చేయబడి, అది ఇరవైనాలుగువేల శ్లోకాలు, ఐదువందలసర్గలు, ఏడుకాండలుగా అలరారింది.

రామాయణంలో శిక్షావ్యాకరణాదిషడంగాలు, వేదవేదాంత రహస్యాలు, గౌతమ, నారద, పాతంజల, బోధాయన, కాత్యాయన, బాదరాయణసూత్రవిశేషాలు ఉన్నాయి. దండనీతి, రాజనీతి, యుద్ధనీతి, పరిపాలనా విధానం, భక్తిజ్ఞానవైరాగ్యాలు, శరణాగతి లక్షణాలు మొదలైనవి తెలుపబడ్డాయి. ఇందులో లేనిది ఇంకేది లేదనేట్లుగ ఐహిక ఆముష్మిక ఫలప్రదమైనట్లు సముద్రంలో రత్నంలా, ఆకసంలో నక్షత్రంలా విశిష్టమైందిగా శ్రీరామ చరిత్రము రచించబడింది.

రామనామమొక్కటే సహస్రనామతుల్యం. పరమ పురుషుడైన శ్రీరామచంద్రుడు పదకొండువేల సంవత్సరాలు ప్రజారంజకంగా రాజ్యపాలన చేశాడు.

ఆ మహనీయునిచరిత్రను ఎందరో కవులు, ఎన్నో భాషలలో రచించారు. అలనాటి మానవులు, పశుపక్ష్యాదులు, నదీనదాలు, పర్వతారణ్యాలు కూడ స్వామిని దర్శించి సేవించి తరించాయి. రామకథాసుధార్ణవమును గ్రహించిన వాడు ధన్యుడు. వాని మనుగడేచరితార్థమౌతుంది.



కొత్త శీర్షిక ప్రారంభం

# శ్రీవారి సన్నిధి - వారసత్వ నిధి

**(ఎస్.వి. మ్యూజియం, తిరుమల)**

**డా॥ పి.వి. రంగనాయకులు**, తిరుపతి

**గూ**గుల్‌వటాల ద్వారా శేషాచలంపై విహంగవీక్షణం చేస్తే మయసభలా కనిపించే బహుగోపురాల భవంతే శ్రీ వేంకటేశ్వర ధ్యానజ్ఞానమందిరంగా పిలువబడే మ్యూజియం. మానవ నాగరకత వికాస క్రమంలో మైలురాళ్లవంటి నిర్మాణాలు, వస్తువులు, ఆభరణాలు, శాసనాలు, విగ్రహాలు, కళాత్మకరూపాలు మొదలైన వాటిని సేకరించి, వర్గీకరించి, కాలనిర్ణయం చేసి, భద్రపరచి, ప్రదర్శించే సంస్థలను వస్తుప్రదర్శనశాలలని, పురావస్తుప్రదర్శనాలయాలని, సంగ్రహాలయాలని భావిస్తాం. అన్ని శాస్త్రాలతోను ఉపశాఖలు ప్రారంభమైనట్టే మ్యూజియం శాస్త్రం (Museology) లోనూ వివిధ అంశాలకు ప్రత్యేకప్రదర్శనశాలలు ప్రారంభించబడ్డాయి. ప్రపంచంలో ఉన్న కొన్ని మతవారసత్వానికి సంబంధించిన ప్రదర్శన శాలలలో (Religious Museums) తిరుమలలో ఉన్న శ్రీవేంకటేశ్వర ధ్యానజ్ఞానమందిరం అనేక ప్రత్యేకతలను కలిగి ఉంది.



నిర్వహణ
**డా॥ పి.వి. రంగనాయకులు**
చీఫ్ మ్యూజియం ఆఫీసర్ (ఎఫ్.ఎ.సి.)
ఎస్.వి.మ్యూజియం, తిరుమల

**వీరు ఆయుర్వేద వైద్యపట్టభద్రులు. 1986 నుండి తిరుపతి ఎస్.వి. ఆయుర్వేద కళాశాలలో అధ్యాపకులు (ప్రొఫెసర్) గా పనిచేస్తున్నారు. ఆయుర్వేదం, చరిత్ర, పర్యావరణం గురించి పదహైదు గ్రంథాలు, వందకు పైగా పరిశోధనా పత్రాలు సమర్పించారు.**

**శతాబ్దాల తరబడి నిత్యపూజలు జరుగుతున్న ఆలయం తిరుమల శ్రీ వేంకటేశ్వరాలయం. రాజ్యాలు మారినా, చక్రవర్తులు గతించినా ఈ దివ్యక్షేత్రప్రాభవం వర్థిల్లుతూనే ఉంది. ఆలయ ప్రాశస్త్యానికి ఉనికి, చరిత్ర, వారసత్వం ముఖ్యకారణాలవుతాయి. కొండలలో ఆవాసాన్ని ఏర్పరచుకున్న శ్రీనివాసుని ఆలయచరిత్ర, వారసత్వాలు భక్తుల నాకర్షిస్తున్నాయి.** అనాదిగా ఉన్న ఆలయాన్ని జీర్ణోద్ధరణ చేసిన పల్లవ పాలకుల (క్రీ.శ. 7 వ శతాబ్దం) నుంచి విజయనగరరాజుల వరకు ఎంతోమంది తమ కానుకలను ఆలయానికి అర్పించారు. వారి వితరణలగురించి ఆలయగోడలపై రాసుకున్నారు. ఆలయంలో జరిగే నిత్యపూజాదికాలు వారసత్వంగా శతాబ్దాలతరబడి జరుగుతూ ఉండటం ఒక అసాధారణ విషయం.




**'రత్నహారీతు పార్థివ'** అంటే విలువైన రత్నాలు అంతిమంగా రాజులనే చేరుతాయి. రాజులు, రాజ్యాలు కాలప్రవాహంలో కలసిపోతుండగా ఆ అమూల్యవస్తువులు ఆలయాలకే చేరుతాయి. రంగదాసు కాలం నుండి నేటి వరకు శ్రీవారి ఆలయకేంద్రంగా జరిగిన వితరణలు, దానాలు, సేవలు, చారిత్రక సంఘటనలు, ధర్మప్రచారం అంతా తిరుమల వారసత్వమే. ఆలయానికి చేరిన ఎన్నో చారిత్రకశకలాలు, పూజాసామగ్రి, రాగిశాసనాలు, రచనలు, గ్రంథాలు అలంకరణ సామాగ్రి, నాణేలు, వస్త్రాలు, చిత్రపటాలు, సంగీతవాయిద్యాలు, ఆభరణాలు శ్రీవారి



సంపదలో భాగమే. వాటిని సమర్పించిన రాజులు, స్థానిక పాలకులు, అధికారులు, ఋషిపుంగవులు, సామాన్య ప్రజలు నాడు కనిపించకపోయినా వారి కానుకలు కనిపిస్తాయి.

వందలాది సంవత్సరాలుగా పోగుపడిన ఈ జ్ఞాపకాలను పదిలపరచుకోవటానికి, తిరుమలను సందర్శించే భక్తులతో వాటిగురించిన జ్ఞానాన్ని పంచుకోవటానికి, ఆలయ చరిత్రను పదిలపరచటానికి, సంప్రదాయాలపై ప్రజలలో గౌరవాన్ని పెంచటానికి తిరుమల తిరుపతి దేవస్థానములు 1979 వ సం॥లో ఆలయానికెదురుగా వున్న వేయికాళ్ళ మండపంలో శ్రీ వేంకటేశ్వర మ్యూజియంను ప్రారంభించింది. ఆ తరువాత 1998 లో ప్రస్తుతమున్న విశాలభవనంలోకి మారింది.

**ఆలయానికి ప్రదర్శనశాల అవసరమా?**

భద్రాచలంలో రాముని ఆలయాన్ని సందర్శించే భక్తులు ఆలయఆవరణలోనే భక్తరామదాసు చేయించిన నగలు చూసి ఎంతో సంతోషిస్తారు. ఆలయాలే చరిత్ర అయినా ఆలయ చరిత్ర ప్రత్యేకంగా పదిలపరచుకోవటం, ప్రదర్శించటం నాగరక లక్షణం. తిరుమలలో ఆలయం తరువాత అంతటి ప్రాధాన్యత కల నిర్మాణం మ్యూజియమే అవుతుంది. ఎందుకంటే, 500 సంవత్సరాల క్రితం రాయించిన అన్నమయ్య పాటల అసలు ప్రతులు అక్కడే ఉన్నాయి. వందలాది సంవత్సరాలుగా ఆలయానికి చేరిన స్వర్ణ, రజత నాణేలు అక్కడే ఉన్నాయి. ఎన్నో శాసనాలు అక్కడే ఉన్నాయి. శ్రీవారి ఆలయం పై కనిపించే ద్రావిడలిపి శాసనాల నకలు, తాత్పర్యాలూ మ్యూజియంలోనే ఉన్నాయి. ఆలయంలో శతాబ్దాల తరబడివాడిన దీపాలు, హారతిపళ్ళేలు, కొన్ని ఆభరణాలు, వాహనాలు అక్కడే ఉన్నాయి. విజయనగరరాజ్య పతనానంతరం ఈస్టిండియా, మహంతుల పాలనలోని గుర్తులన్ని భద్రంగా ఉన్నాయి. వీటిని జ్ఞాపకంలో ఉంచుకుంటూ తిరుమల తిరుపతి దేవస్థానం విస్తరిస్తున్న విధానాన్ని మ్యూజియం మాత్రమే నమోదు చేయగలుగుతుంది. భవిష్యత్తుకు అందజేయగలుగుతుంది.

**విరిగిన విగ్రహాలు?**

పురావస్తు ప్రదర్శనశాలలో విరిగిన విగ్రహాలు మాత్రమే కనిపిస్తాయని అందరూ భావిస్తారు. అవిచ్ఛిన్నవిగ్రహాలైతే ఆలయాలలోనే ఉండి పూజలందుకుంటుంటాయికదా? తిరుమల, తిరుపతి పరిసరాల్లో లభించిన విగ్రహాలు, పాక్షికంగా ధ్వంసమైనా, మ్యూజియంకు చేరుతాయి. అలా చేరిన విగ్రహాల కాలనిర్ణయం చేసి, అవి ఏప్రాంతానివో ఏశైలికి సంబంధించినవో పరిశోధించి మన పూర్వీకుల ఆచార సంప్రదాయాలను తెలుసుకునే అవకాశం కల్పిస్తాయి ఈ విగ్రహాలు. మన సంస్కృతిని, శిల్పకళను ఎలా కాపాడుకోవాలో, ఎందుకు కాపాడుకోవాలో కూడ ఈ విరిగిన విగ్రహాలు మనకు పాఠాలు చెబుతాయి.

తిరుమల తిరుపతి దేవస్థానానికి అందుబాటులోకి వచ్చిన అనేక రాతి, కాంస్య విగ్రహాలను ఎస్.వి. మ్యూజియంలో అమర్చటం జరిగింది. ఆలయదర్శనం తరువాత ఈ మ్యూజియంను సందర్శించి గతంలోకి ప్రయాణించవచ్చు.

**పఠనం, ధ్యానం**

తి.తి.దే. మ్యూజియంలో మరొక ఆసక్తికరమైన అంశం చక్కటి గ్రంథాలయం. తెలుగు, తమిళ, కన్నడ, హిందీ, ఆంగ్ల భాషలలో హిందూజీవనవిధానం, ఆలయాలు, చరిత్ర, సంస్కృతిల గురించి ఎన్నో గ్రంథాలను తిరుమల సందర్శించే భక్తులకు అందుబాటులో ఉంచారు.

మ్యూజియం మొదటి అంతస్తులో మూడు ధ్యానమందిరాల్ని కూడ తి.తి.దే. నిర్వహిస్తున్నది. ప్రశాంత వాతావరణంలో భక్తులు ఇక్కడ ఉదయం 8 గం॥ల నుండి సాయంత్రం 6 గం॥ల మధ్య ధ్యానం చేసుకోవచ్చు.

శ్రీ వేంకటేశ్వర ధ్యాన జ్ఞానమందిరం తిరుమల చరిత్రకు భాండాగారం. నిత్యం అనేక చరిత్రశకలాలు ఆలయాన్ని చేరుతూనే ఉంటాయి. త్రవ్వకాల్లో లభించిన అపురూప వస్తువులను ప్రజలు ఆలయానికివ్వటానికి సదాసిద్ధంగా ఉంటారు. దేశవ్యాప్తంగా తిరుమల తిరుపతి దేవస్థానాలపైకల నమ్మకాన్ని పునాదిగా చేసుకుని ఎస్.వి. మ్యూజియం సమాజసేవలో నిమగ్నమై ఉంది. ప్రదర్శనశాలలు మరియు గ్రంథాలయాలు మాత్రమే సమాజానికి మెదడు వంటివి. అవే జ్ఞాపకాలను, అనుభవాలను పదిలపరుస్తాయి. ఆ అనుభవసారంతోనే మానవజాతి ముందుకు కదుల్తుంది. తిరుమల యాత్రికులకు మ్యూజియం సందర్శన ఒక మధురానుభూతిని మిగుల్చుతుంది.





# ఆరోజుల్లో...

సాధారణంగా మనకు మన పాతరోజులు మళ్లీగుర్తు చేసుకుంటే ఆనందంగాను, ఆశ్చర్యంగాను ఉంటుంది. అదే కొన్ని సంవత్సరాలు వెనక్కి వెళితే అనుభూతి ఎలా ఉంటుందో ఊహించండి. సరిగ్గా అలాంటి ప్రయత్నమే సప్తగిరి 'ఆరోజుల్లో' శీర్షికద్వారా చేస్తోంది. సుమారు యాభైఏళ్ల క్రితం తిరుమల తిరుపతి దేవస్థానం విశేషాలు పాఠకులకు ఆసక్తికరంగా అందించే ప్రయత్నం ఇది.

- **1950 అక్టోబరు 20 :** గత నాలుగు సంవత్సరాలుగా తిరుమలలో బసచేస్తున్న భక్తులసంఖ్య పెరుగుతున్నందు వల్ల నీటి సమస్య ఏర్పడింది. తిరుమల నీటిసమస్యను తీర్చటంకోసం అప్పటి మద్రాసు రాష్ట్ర మొదటి గవర్నర్ కల్నల్ మహారాజ కృష్ణకుమార్ షింజి (1912-1965) పాపవినాశనం నీటి సరఫరా స్కీమ్‌కు పునాదిరాయి వేశారు. కృష్ణకుమార్ షింజి గుజరాత్‌నందలి భావనగర్ పాలకులు. ఇతను 7 సంవత్సరాల వయసులోనే (1917) భావనగర్ సంస్థాన సింహాసనాధీశులు అయ్యారు.

- **1952 అక్టోబర్ 21 :** అప్పటి మద్రాసు రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ సి.రాజగోపాలాచారి సరిగా రెండు సంవత్సరాల అనంతరం తిరుమలలో నిర్మించబడిన పాపవినాశనం నీటిసరఫరా పథకాన్ని 'ట్యాప్' త్రిప్పటం ద్వారా ప్రారంభించారు. ఇక ఇప్పటి నుంచి తిరుమలలో నీటి సమస్యకు స్వస్తి అని అప్పటి పత్రికలు ప్రచురించాయి.

- వేయి సంవత్సరాల క్రితమే, అనగా పదకొండవ శతాబ్దంలో, శ్రీరామానుజాచార్యులవారి శిష్యుడు అయిన ఆనందన్ పిళ్లై (ఆనందాళ్వాన్) స్వహస్తాలతో జీవితాంతం శ్రమించి ఏర్పాటు చేసిన ఆళ్వార్ ట్యాంక్ మాత్రమే శ్రీవారి భక్తులకు నీటి అవసరాలు తీర్చేది. ఇప్పటికీ ఆళ్వార్ ట్యాంకు నీటిని నిల్వ చేసుకుంటూ పరిసరాలకు పచ్చదనాన్నిప్రసాదిస్తున్నది.


ఆళ్వార్ ట్యాంకు




నలభైఆరేళ్ళ క్రితం అనగా 1969 ఫిబ్రవరి జర్నల్ సంచిక (సప్తగిరి) ముఖచిత్రాన్ని మీకు అందిస్తున్నాం. అయితే అప్పట్లో దీనికి సప్తగిరి అనే పేరు లేదు. దీనిని తిరుమల తిరుపతి దేవస్థానముల 'జర్నల్' అని పిలిచేవారు. అప్పుడు సంచిక వెల 0.25 పైసలు, సంవత్సరచందా రూ.3/-. ఒకే సంచికలో ఐదు భాషల వ్యాసాలు వెలువడేవి. అప్పటి సంపాదకులు శ్రీ కె.ఉమాపతి.

మనదేవాలయాలు

# శ్రీరామతీర్థం

చివుకుల రమాకాంతశర్మ, 9949012612

"శ్రీరామతీర్థం" విజయనగరానికి ఈశాన్యంగా చంపావతీ నదీ సమీపంలో ఉంది. భాస్కరపుష్కరిణికి-నీలాచలానికి మధ్యన పచ్చని కొండలు, పచ్చికబయళ్ళే హద్దులుగా నిత్య భక్త జన సందోహంతో ఉంటుంది.

విజయనగరానికి పన్నెండు కి.మీ.దూరంలో శ్రీరామతీర్థ గ్రామం ఉన్నది. గ్రామనడిబొడ్డులోనే శ్రీరామస్వామి దేవాలయ గాలిగోపురం కనువిందుచేస్తూ భక్తులకు స్వాగతం పలుకుతుంది.



శ్రీ సీతారామలక్ష్మణ స్వామి వారి దేవాలయ ప్రాంగణం

## క్షేత్రమాహాత్మ్యం

ద్వాపరయుగంలో జూదంలో అపజయం పొందిన పాండవులు అరణ్యవాసానికి వెళ్తూ శ్రీకృష్ణుని కూడా తమ వెంటరమ్మని కోరారు. అందుకు శ్రీకృష్ణుడు "నేను రామావతారంలో దండకారణ్యప్రాంతంలో సీతాలక్ష్మణ సమేతంగా ప్రయాణించాను". అని చెప్పి సీతాలక్ష్మణ సమేత శ్రీరాముని విగ్రహప్రతిమలను సృష్టించి పాండవులకు అందించాడు. వారిని భక్తితో పూజించినచో శ్రీరాముడు మీ వనవాసకాలమున మీ ఐదుగురిని సర్వకాల సర్వావస్థల యందునూ రక్షణచేకూరుస్తాడు" అని చెప్పి ఆశీర్వదించాడు.

ఆ ప్రకారం పాండవులు ఆ ప్రాంతంలోనే సంచరిస్తూ, సీతారామలక్ష్మణులకు అక్కడే దేవాలయం నిర్మించారు. సీతారాములను సేవిస్తూ వనవాసకాలం గడిపారు. ఆ దండకారణ్యప్రాంతాన్ని వదలి వెళ్తూ 'వేదగర్భుడు' అనే వైఖానస వైష్ణవునికి ఆ దేవాలయాన్ని అప్పగించారు. అప్పటినుండి అతడి కుటుంబం వారు స్వామివారిని సేవిస్తూ ఉన్నారు. కారణాంతరాలవల్ల వేదగర్భుడి వంశీయులు సీతారామలక్ష్మణ విగ్రహాలను భూగర్భజలాల్లో భద్రపరిచారు. ఒక మూగవృద్ధస్త్రీ ఆ ప్రాంతంలోనే శ్రీరామనామాన్ని ధ్యానించి స్వామి అనుగ్రహంతో మాట్లాడే శక్తిని పొందింది. ఆనాడు పరిపాలించిన మహారాజుకు స్వప్నంలో శ్రీరాముడు దర్శనమిస్తాడు. తన భక్తురాలు ఒక వృద్ధ స్త్రీ అతని వద్దకు వస్తుందని ఆమె చెప్పినట్లు చేయమని తెలియచేస్తాడు. మరుసటిరోజు రాజు ఆ ముదుసలి చెప్పింది విని, ఆ ప్రకారం సీతారాములకు దేవాలయాన్ని నూతనంగా నిర్మిస్తాడు. ఈ దేవాలయ నిర్వహణకు మహారాజావారు పన్నెండువందల ఎకరాల పంట భూమిని ఇచ్చారు.

## నామౌచిత్యము

**సీతారాముల విగ్రహాలు నీటిలో లభించాయి. నీరు అనగా 'తీర్థం', కనుక ఈ క్షేత్రానికి "శ్రీరామతీర్థం" అనే పేరు సార్థకమైందని స్థలపురాణం. శ్రీరాముడు ధర్మస్వరూపుడు. శ్రీకృష్ణుడు ధర్మప్రబోధకుడు. పంచపాండవులు ధర్మపరులు. వీరిచే రూపుదిద్దుకున్న 'శ్రీరామతీర్థం' ధర్మక్షేత్రం.**

## భాస్కర సరస్సు

దేవాలయానికి దక్షిణభాగంలో స్వచ్ఛమైన నీటితో, తామర పుష్పాలతో కూడిన భాస్కరసరస్సు ఉంది. ఈ సరస్సు మధ్యలో ఒక మండపం ఉంది. భక్తులు ఈ సరస్సులో స్నానమాచరించి పునీతులవుతున్నారు.



## స్వామి ఉత్సవములు

సీతారాముల కల్యాణోత్సవం ప్రతిసంవత్సరం మాఘశుద్ధ ఏకాదశి (భీష్మఏకాదశి) రోజున అంగరంగ వైభవంగా నిర్వహిస్తారు. ఈ ఉత్సవాలు ఐదురోజులు ఎంతో శోభాయమానంగా జరుగుతాయి. స్వామివారు సీతాలక్ష్మణ



శ్రీరామతీర్థంలోని సీతారామలక్ష్మణ మూలమూర్తులు

సమేతుడై రోజుకొక వాహనంపై అధిష్టించి పురవీధులలో ఊరేగుతారు. శ్రీరామనవమిఉత్సవాలను అత్యంత భక్తి శ్రద్ధలతో ఘనంగా నిర్వహిస్తారు.

కార్తిక శుద్ధద్వాదశినాడు భాస్కరసరస్సునందు సీతారామలక్ష్మణ ఉత్సవమూర్తులను తెప్పలపై అధిష్టింపచేసి, వివిధపుష్పాలతో అలంకరింపచేసి, విద్యుద్దీపాలంకరణలతో సరస్సులో విహరింపచేస్తారు.

ఈ ఆలయంలో ధనుర్మాసంలో తిరుప్పావై పఠిస్తారు. భోగిపండుగరోజు గోదాకల్యాణం జరుగుతుంది. వైకుంఠఏకాదశి రోజు స్వామివారు ఉత్తర గాలిగోపురంలో ఆసీనులౌతారు.

## ఉపాలయాలు

ఈ ఆలయప్రాంగణంలో వైకుంఠనాథస్వామి; వేణుగోపాలస్వామి; లక్ష్మీదేవి; మాధవస్వామి; భూభుజంగ మహాలక్ష్మీ నరసింహస్వామి; ఆంజనేయస్వామివార్ల దేవాలయాలు ఉపాలయాలుగా ప్రసిద్ధిపొందాయి.

చెన్నై – కలకత్తా రైలు మార్గములో విజయనగరం స్టేషన్ ఉన్నది.



### తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి

#### తిరుమలలో భక్తులు చేయవలసినవి

1. తిరుమలకు బయలుదేరేముందు మీమీ ఇష్టదేవతలను పూజించండి.
2. శ్రీవేంకటేశ్వరస్వామిని దర్శించేముందు శ్రీవారిపుష్కరిణిలో స్నానంచేసి, శ్రీవరాహస్వామిని పూజించండి.
3. ఆలయంలో పూర్తిగా నిశ్శబ్దాన్ని పాటిస్తూ "ఓం శ్రీవేంకటేశాయ నమః" అని మీలో మీరు శ్రీవారిని స్మరించుకోండి.
4. ఆలయంలో ఉన్నప్పుడు స్వామివారిపైనే మీ ధ్యాస ఉంచండి.
5. తిరుమల సమీపంలో ఉన్న ఆకాశగంగ, పాపవినాశనం తీర్థాలలో స్నానం చేయండి.
6. తిరుమలలో ఉన్నప్పుడు మన సనాతన సంప్రదాయాలు, ఆచారవ్యవహారాలు విధిగా పాటించండి. సంప్రదాయ దుస్తులు, తిరునామం ధరించండి.
7. తిరుమలపై సర్వాలంకారాలు స్వామివారికేనని గ్రహించండి. పూలు, అలంకరణ దినుసులు, సుగంధద్రవ్యాలు సొంతానికి వినియోగించకండి.

#### తిరుమలలో భక్తులు చేయకూడనివి

1. విలువైన ఆభరణాలు, ఎక్కువడబ్బు మీవద్ద ఉంచుకోకండి.
2. శ్రీవారిదర్శనంకోసం త్వరపడకండి. క్యూలో మీవంతు వచ్చేవరకు ఆగండి.
3. ఆచారవ్యవహారాలప్రకారం ఆలయార్హత లేనిసందర్భాలలో ఆలయంలోకి రాకండి.
4. అపరిచితులను, వసతిగృహాలలోనికి అనుమతించకండి, వారిని నమ్మి గదితాళాలు ఇవ్వకండి.
5. నీరు, విద్యుత్తు వృథా చేయకండి.
6. నాలుగుమాడవీధులలో పాదరక్షలు ధరించకండి.

# నాగులచవితి

సుస్వరం నాగరాజ్, ఆదోని

**హిం**దువుల పండుగలలో నాగులచవితి, నాగపంచమి కూడ ప్రముఖమైనవే. ఈ రెండురోజులు నాగదేవతను పూజించడం మన సంప్రదాయం. దీనివల్ల ఆయురారోగ్య సత్సంతానాలు లభిస్తాయి.

ఈ పండుగరోజుల్లో ప్రజలు ఇండ్లను శుభ్రపరచుకొని తలంటుస్నానం చేస్తారు. రంగవల్లులతో నాగదేవతను నేలపై, పసుపుతో గోడలపై వేస్తారు. ఆ తరువాత వారివారి శక్తిమేరకు బంగారు, వెండి, రాగి, నాగ ప్రతిమలను పెట్టి పూజిస్తారు. ఆ తర్వాత నువ్వులచే చేసిన మధుర పదార్థములను నైవేద్యమిచ్చి, నాగప్రతిమకు పాలాభిషేకం చేస్తారు. మరికొందరు శిలానాగ ప్రతిమలకు కూడ పాలను పోసి మ్రొక్కుతారు. దీనివల్ల సర్పభయం దూరమవుతుంది. నాగులచవితినాడు స్త్రీలు ఉపవాసం చేసి, నాగపంచమి రోజు నాగదేవతను షోడషోపచారాలతో పూజిస్తారు. పిండి వంటలతో నైవేద్యాన్ని సమర్పించి బంధువులు స్నేహితులు, పిల్లలతో కలిసి భోజనం చేస్తారు. స్త్రీలు అన్నదమ్ములకు, పిల్లలకు నూతన వస్త్రాలు, కానుకలు ఇస్తారు.

హాస్యవిజ్ఞానులు కూడ ఈ నాగేంద్రునిగూర్చి చెప్పుచూ - శ్రీమన్నారాయణుడు శేషశాయి. అతనికి నిద్రవచ్చినప్పుడు లక్ష్మిని అర్థాత్ సంపదను కాచేవాడు ఒకడు కావాలికదా! కాబట్టి లక్ష్మీదేవి రక్షణార్థం శేషుణ్ణి నియమించడమే సబబని భావించాడు. అందుకేనేమో నిధినిక్షేపాలవద్ద పాములే ఎక్కువగా కాపలాకాస్తుంటాయని పెద్దలంటారు. రామావతార కాలంలో కూడ శ్రీ మహావిష్ణువు శేషాంశుడైన లక్ష్మణుని సీతకు కాపలా ఉంచి, జింకను తేవడానికి వెళతాడు. అయితే ఆ లక్ష్మణుడు అటు వెళ్ళిన తర్వాతనే రావణుడు వచ్చి సీతను అపహరించడం జరుగుతుంది.

అంతేకాదు ఈ నాగేంద్రుడు నిష్కామి. దేవతలలో దేవుడై, ఈ భూమిపై జీవరాశులలో ఒక జాతిదై, మరొకవైపు భూమినే మోసుకొన్నదైనది. విష్ణువుకు పానుపు, శివునికి కంఠాభరణం, వినాయకుని ఉదరపాశంగా ఉన్నాడు.

కొన్నిచోట్ల సర్పరూపంలో వుండే సుబ్రహ్మణ్యస్వామిని ఆరాధించే ఆచారము కూడ ఉంది. శక్తిధరుడైన ఈ

**ఈ నాగేంద్రుని హరిహరులు కూడ ఎంతో ప్రీతిగా గౌరవించి గ్రహించారు. ఒకరు పాన్పు చేసుకొంటే, మరొకరు కంఠాభరణము చేసుకొన్నారు.**

సుబ్రహ్మణ్యస్వామికి అపూర్వమైన ఈ కుండలినీ రూపం ఉండటం చేతనే నిధి సంరక్షకుడుగా ఆరాధించుట కూడ ఉంది. శాస్త్రాలలో కుండలినీ ప్రస్తావన వచ్చినచోటల్లా దాని వెనుక ఎంతో ఆధ్యాత్మిక తత్త్వ విచారం ఉంటుంది.



15-11-2015 నాగులచవితి



శాస్త్రాలలో పురాణాలలో ప్రశంసించబడిన ఈ శేషుడు రామావతారంలో లక్ష్మణుడు, కృష్ణావతారములో బలరాముడు. ఈ కలియుగంలో వేంకటాచలమని పిలువబడే ఈ పర్వతము తానై, తనపై ఆ వేంకటేశ్వరుణ్ణి నిలబెట్టుకొన్నాడు. భవిష్యోత్తర పురాణములో ఈ పర్వత ప్రాశస్త్యమును గూర్చి చెప్పబడింది. మరొకచోట "వదనం

**ప్రపంచములోని జీవరాశుల సృష్టిలో ఈ నాగసృష్టి మానవసృష్టికన్నను మొదటనే జరిగిందని చెప్పవచ్చు. నాగేంద్రుడు ఆరోగ్యదాత. ఇతనిని పూజించిన తాపములు తొలగుతాయి...**

వేంకటగిరిః నృసింహాచల మధ్యమః" శ్రీశైలం పుచ్ఛభాగస్తు సర్వక్షేత్రమయోగిరిః'' శేషుని ముఖమే (పడగనే) వేంకటపర్వతము. దాని శరీరమధ్యమమే అహోబిల నృసింహక్షేత్రము. పుచ్ఛభాగము (తోకభాగము) శ్రీశైలమని చెప్పబడినది. అందుకే అన్నమయ్య కూడ ఈ పర్వతాన్ని చూచి 'పదివేల శేషుల పడగలమయము' అని అన్నాడు. అంతేకాక ఈ శేషుని ప్రశంసిస్తూ కూడ 'వీడుగదె శేషుడు శ్రీవేంకటాద్రి శేషుడు' అని కీర్తనను పాడినాడు. 

**తిరుమల తిరుపతి దేవస్థానం, తిరుపతి**

## తలనీలాల సమర్పణ




తిరుమలలో వివిధ ప్రాంతాలలో వున్న
మినీ కల్యాణకట్టలలో తలనీలాలు, కత్తెర్లు
సమర్పించుట పూర్తిగా ఉచితం చేశారు.
గతంలో వసూలు చేస్తున్న
రూ.10/- రుసుమును
భక్తులు చెల్లించనక్కరలేదు.
ప్రధాన కల్యాణకట్టలోను, మినీ
కల్యాణకట్టలలోను భక్తులు ఎటువంటి
రుసుము చెల్లించనవసరం లేకుండానే
తలనీలాలు, కత్తెర్లు సమర్పించవచ్చు.

## శ్రీనివాస మంగాపురం శ్రీ వేంకటేశ్వరస్వామివార్ల పవిత్రోత్సవ క్రమము

| | | | |
|---|---|---|---|
| **06-11-2015** | శుక్రవారము | -- | అంకురార్పణ (రాత్రి) |
| **07-11-2015** | శనివారము | పవిత్ర ప్రతిష్ఠ | ఆశ్వయుజ బహుళ |
| **08-11-2015** | ఆదివారము | పవిత్ర సమర్పణ | ద్వాదశికి జరుగును. |
| **09-11-2015** | సోమవారము | పవిత్రోత్సవ సమాప్తి | |

## తిరుమల శ్రీవారి పుష్పయాగ మహోత్సవ క్రమము

| | | | |
|---|---|---|---|
| **17-11-2015** | మంగళవారము | -- | అంకురార్పణము (రాత్రి) కార్తికమాసమున |
| **18-11-2015** | బుధవారము | పుష్పయాగము | శ్రవణ నక్షత్రమున జరుగును |

బాలప్రబోధం

# వివేకం

ఎల్.సువర్చల, హైదరాబాదు.

అన్నదమ్ములైన పాండవ, కౌరవులమధ్య జరుగనున్న ఘోరమారణసంగ్రామాన్ని ఆపాలన్న తలంపుతో శ్రీకృష్ణుడు రాయబారానికి అంగీకరించాడు. సంధి కుదర్చడానికి ఆఖరి ప్రయత్నం చేయదలచుకున్నాడు శ్రీకృష్ణుడు.

కృష్ణుడు పాండవపక్షపాతి అన్న సందేహం దుర్యోధనుడికి ఎప్పుడూ ఉండేది. పాండవులపట్ల తనకున్న ఈర్ష్యను, కృష్ణునిపట్ల తనకున్న అనాదరభావాన్ని వ్యక్తం చేసేందుకు ఏవిధమైన స్వాగత ఏర్పాట్లు చేయగూడదని ఆజ్ఞలు జారీ చేశాడు. స్వాగతతోరణాలు కానీ, వీథుల అలంకరణగానీ చేయించలేదు. పురపౌరులను నగరానికి బయట నిలబడి కృష్ణుడిని చూడటానికి కూడా అనుమతించలేదు.

కృష్ణభక్తుడైన విదురుడు తన ఆరాధ్యదైవానికి స్వాగతమివ్వడానికి ఊరిబయట చేతులు కట్టుకొని నిలబడి వేయికళ్ళతో శ్రీకృష్ణుని రాకకోసం ఎదురుచూస్తున్నాడు.

ఆ తరువాత కాసేపటికి కృష్ణుడి రథాన్ని చూసిన విదురుడు వడివడిగా ముందుకు నడిచాడు. రథంమీది నుండి క్రిందకు దిగిన కృష్ణుడికి విదురుడు భక్తిశ్రద్ధలతో సాష్టాంగనమస్కారం చేశాడు. “ఓ పరమాత్మా హస్తినాపురంలో ఉన్న నా గృహానికి దయచేసి చిరకాలమయింది. నా ఇంటికి విచ్చేసి నన్ను నా గృహాన్ని పావనం చేయండి” అని ప్రార్థించాడు. సర్వం తెలిసిన జగన్నాథుడు విదురుని ఆహ్వానాన్ని మన్నించాడు.

ఇంటికి చేరిన పిమ్మట ఉచితాసనాన్ని ఇచ్చి సేద తీరుమన్నాడు. ఆ తరువాత కొన్ని సంవత్సరాల క్రిందటి అలవాటు ప్రకారం అరటిపండ్లను స్వీకరించుమన్నాడు. బాలకృష్ణుడికి ఇలా తినిపించిన రోజులు విదురుడికి గుర్తుకు వచ్చాయి. కందను విడిచి తొక్కను పరవశంతో కృష్ణునికి ఇవ్వసాగాడు. కృష్ణుడు ఆ తొక్కనే తృప్తిగా ఆరగించాడు.

తరువాత కొద్దిసేపటికి కృష్ణుడు విదురుడితో “మనం తక్షణం దుర్యోధనుడి దర్బారుకు బయలుదేరాలి. మనం ఆలస్యం చేశామంటే దుర్యోధనుడు అన్యథా భావించవచ్చు” అన్నాడు.

కృష్ణుడి పాదాలచెంత కూర్చున్న విదురుడు లేచి నిలబడ్డాడు. అప్పుడు అతని దృష్టి పళ్ళెరంమీద పడింది. పళ్ళెరంలో తొక్కలకు బదులు కంద ఉండటం గమనించాడు. తాను తొక్కను ఇవ్వగా దానినే కృష్ణుడు తిన్నాడని విదురుడికి అర్థమయ్యింది.

**విదురుడి కంటినుండి అశ్రువులు జలజల రాలాయి. అతడి గొంతు దుఃఖంతో పూడుకు పోయింది. భావావేశానికిలోనై విదురుడు తన అజాగ్రత్తవల్ల కృష్ణునికి అమర్యాద జరిగినందుకు క్షమించమని వేడుకున్నాడు.**



**నా భక్తులు ప్రీతితో ఏమి సమర్పించినా నేను సంతోషంగా స్వీకరిస్తాను. నాకు కావలసింది కేవలం భక్తి మాత్రమే.**

భక్తులమదిలో చెలరేగే ఆలోచనలను సైతం పసిగట్టగల జ్ఞాని అయిన కృష్ణుడు విదురుడితో "వివేకసంపన్నుడవైన ఓ విదురా! నీవు నన్ను క్షమించమని వేడుకుంటున్నావు. ఈ కోరికకు అర్థం ఒకలా స్ఫురిస్తుంది. నాదృష్టిలో నీవు పరిపూర్ణ వివేకాన్ని ఇంకా పొందలేదు. నన్ను దాంబికరూపంలో దర్శించిన నువ్వు తన్మయుడవై నావన్న సంగతి నాకు అర్థమయింది. ఈ కారణంగా నీ కంటికి నేను తప్ప పరిసరాల్లోను ఉన్న ఏ వస్తువు కనబడలేదు. అందుకే కండను పళ్ళెరంలో వేసి తొక్కను మాత్రం నాకు ఇచ్చావు. ఇది పరవశత్వం కారణంగానే జరుగుతుంది. ఇంకామరో విషయమేమిటంటే నన్ను నీవు సరిగ్గా అర్థం చేసుకోవడంలో సఫలీకృతుడవు కాలేకపోయావు. నావరకు తొక్కకు, కండకు వ్యత్యాసం అసలు లేదు. నా భక్తులు ప్రీతితో ఏమి సమర్పించినా నేను సంతోషంగా స్వీకరిస్తాను. నాకు కావలసింది కేవలం భక్తి మాత్రమే. ఈ బహుమతి నాకు ప్రియకరమైంది. నేను దాన్నే స్వీకరిస్తాను. నీవు గొప్ప జ్ఞానివే. అయినా ఎందుకో ఈ విషయంలో నీవు వివేకాన్ని కోల్పోయావు. ఈ ప్రపంచంలో ఎవ్వరూ సంపూర్ణవివేకాన్ని పొందలేరు. విదురా! నీవుగూడా వివేకాన్ని పెంచుకో" అన్నాడు. ఈ మాటలు విన్న విదురునికి తనలోపమేమిటో స్పష్టంగా అర్థమైంది.

**ధారావాహిక - 49**

# మందార మకరందాలు



**అళినీలాలకఁ బూర్ణచంద్రముఖి నేణాక్షిం బ్రవాళాధరన్**
**గలకంఠిన్ నవపల్ల వాంఘ్రియుగళన్ గంధేభకుంభస్తనిన్**
**బులినశ్రోణి నిభేంద్రయాన నరుణాంభోజాతహస్తన్ మహో**
**త్పలగంధిన్ మృగరాజమధ్యఁ గని విభ్రాంతాత్ము లై రందఱున్.**

గౌరీపూజకు వెళ్లుతున్న రుక్మిణిని ఘంటాపథంలో మూగిన రాజ వీరులు కనుగొన్నారు. వీరందరూ ఆమెనే చూస్తున్నారు. ఆమె 'హరిరాకకు' ఎదురు చూస్తూ నడుస్తున్నది. అలా నడుస్తుంటే ఆమె వీరమోహినిలా ఉందట. మామూలు మోహినిని చూస్తేనే తల తిరిగిపోయే ఆ రాకుమారులు 'వీరమోహిని'ని చూస్తే ఇంకేమవుతారు? 'విభ్రాంతాత్ములైనా'రట. అంటే వారి మనసులే చెదరిపోయినాయన్నమాట: ఆమె సర్వాంగ సౌందర్యం వారి కనులకు మిరుమిట్లు గొలిపింది. ముందు వారికి తుమ్మెదరెక్కలవంటి కురులు కనిపించినవి. తరువాత పున్నమిచంద్రబింబంవంటి ముఖం కనిపించింది. ఆ తరువాత జింక కన్నులు, పగడాల పెదవి, కలకంఠం, పాదపల్లవాలు, కుచకుంభాలు ఇత్యాదులు. ఏమిటీ క్రమం? నిజమే! స్థూల దృష్టికి అలాగే కనిపిస్తుంది. కురులనుండి చరణాలవరకో, చరణాలనుండి కురులవరకో, వర్ణించవలసిందికదా! ఏమిటీ వ్యత్యాసం మరి? అక్కడే పోతన్న సాధించిన ఔచిత్యం పరాకాష్ఠ నందుకున్నది. చూసేవారు విభ్రాంతాత్ములు. మతి చెదిరినవారు. ఉన్మాదం ముదిరినవారు. ఆ జగన్మోహిని దుర్నిరీక్ష్య సౌందర్యాన్ని ఒక క్రమంలో చూడగలుగుతారా? ఈ దృష్టి ఉంది గనుకనే పోతన్న రెండు సాభిప్రాయపదాలు ప్రయోగించి నాడు. ఆమె 'వీరమోహిని' అని వారు 'విభ్రాంతాత్ము' లని.

**డా॥ సి. నారాయణ రెడ్డి**



# శరణాగతి

నీలంరాజు రాధాకృష్ణమూర్తి, ఒంగోలు, 9963803015

మనందరి ప్రత్యక్షదైవమై, నిత్యుడై, సత్యమై, బ్రహ్మమై, సంస్తుత్యుడై, అఖిలాండకోటి బ్రహ్మాండనాయకుడై, శేషగిరిపై నెలకొన్న సౌభాగ్యనిధి, సాటిలేని పరమాత్ముడై, భక్తులు కోరినంతనే, ఎన్నో వరాలిచ్చే, శ్రీవేంకటప్రభువును ఎన్నిసార్లు చూచిన తనివి తీరదు.

సృష్టి, స్థితి, లయకారకుడు, ఆదిమధ్యాంతరహితుడు, త్రిదశపూజ్యుడు, త్రిలోకనాయకుడైన శ్రీవేంకటేశ్వరుని అనునిత్యమూ మనస్సులో స్మరించుకోవడమే మన అదృష్టం, ఆ స్వామి ఒక్కడే కొలిచినవారికి కొంగుబంగారం. సర్వాంతర్యామి యైన శ్రీనివాస భగవానుని శరణాగతి కోరడమొక్కటే మన లక్ష్యం. నిరంతరమూ ఈ శరణాగతి మార్గంలో పయనించేవారికి పరమాత్మప్రాప్తి తప్పక కల్గుతుంది.

ఇంద్రియ విజయానికి మూలకారణం భగవత్ కృపే. నిర్మలమైన మనస్సుకే బ్రహ్మసాక్షాత్కారం లభిస్తుంది. దేహం పై మోహాన్ని వీడడం వల్ల, 'మాయ' ను అధిగమించవచ్చు. తెరలు తొలిగిన కొద్దీ పరమాత్మతో బంధం ఏర్పడుతుంది.

నిర్భయం, అంతఃకరణశుద్ధి, దానం, ఇంద్రియనిగ్రహం, దైవారాధన, సాధ్యాయం, తపస్సు, అహింస, అక్రోధం, త్యాగం, శాంతి, దయ, మృదుత్వం, నిశ్చలతత్త్వం, నిరహంకారం మొదలైనవి మనల్ని భగవంతునికి దగ్గర చేస్తాయి. పరమేశ్వరునిపై గల అనురక్తే 'భక్తి'.

పరమాత్మకు 'సర్వశరణాగతి' చేసి మనం కేవలం నిమిత్త మాత్రులమనే స్పృహ ఉన్నప్పుడు, ఆయనే మనల్ని ప్రహ్లాదుడిని కాపాడినట్టు కాపాడుతాడు. మన హృదయం ఆత్మ, పరమాత్మల గుహ. భగవంతుడు ఎక్కడ వెతికినా కనిపిస్తాడు. దేవదేవుడు సర్వోన్నతుడు. మనస్సులోకి తొంగిచూస్తే ఆదైవం ప్రత్యక్ష మౌతాడు, మనదేహం ధర్మంగా ప్రవర్తిస్తేనే ఆత్మ సర్వాంతర్యామి వైపు వెళ్తుంది. ఈ దేహంతోనే ధర్మార్థకామ మోక్షాలు సాధించ వచ్చు. భక్తికి పరాకాష్ఠ "పరవశం" అనగా మనస్సు, దేహము, ఆత్మలను కలిపి జేసే ప్రక్రియే "పారవశ్యం".



**"ఓ తిరుమలేశా! గోవిందా! శ్రీలక్ష్మీరమణా! నీపాదాలముందు 'రాతి గడపగా' పడి ఉండినట్లైతే, చిఱునవ్వు తొలికే నీ ముఖారవిందాన్ని నిరంతరమూ చూస్తూ.... ఉండవచ్చునుకదా!...."** అని కులశేఖరచక్రవర్తి స్వామివారిని శరణాగతి కోరగా, ఆయన కోరికమేరకు శ్రీవారు తిరుమలలో తనముందున్న రాతిగడపను "కులశేఖరపడి" అని పిలిచేటట్టు వరమిచ్చారు. ఇది ఆయన అపారమైన భక్తిని చాటుతూంది. అందుకనే భక్తులు కోరినంతనే, సకల సౌభాగ్యాలనిచ్చే తిరుమలేశుని దివ్యచరణారవిందాలను భక్తి ప్రపత్తులతో కొలిచి, శరణాగతులమై స్వామివారి దివ్యాశీస్సులను పొందుదాం!

"శ్రీవేంకటేశ చరణౌ శరణం ప్రపద్యే".

సర్వేజనా స్సుఖినోభవంతు! సమస్త సన్మంగళానిభవన్తు!!



గృహలక్ష్మి

# కార్తికదీపాల ఆనందహేల

ఎమ్. సి. శివశంకరశాస్త్రి

కార్తికమాసం వచ్చిందంటే అందరిలో హడావిడి కన్పిస్తుంది. ఉత్తరభారతంలో ఈ మాసానికి అంతగా ప్రాముఖ్యత కనిపించదు. దక్షిణాదిన ముఖ్యంగా మనరాష్ట్రంలో కార్తికానికి అత్యధిక ప్రాధాన్యత వుంది. నోములు, వ్రతాలు ఆచరిస్తారు ముత్తయిదువలు. పురాణపఠనం చేస్తారు వృద్ధులు. వనభోజనాల సరదాలతో ఈ నెలంతా భక్తితోను, ఆనందంతోను గడపడాన్ని చూడగలం. వనభోజన వేడుకలతో పల్లెప్రాంతాల్లోని తోటలు పట్టణప్రాంతాల్లోని పార్కులు కళకళలాడుతూంటాయి. ఇక దేవాలయాల సంగతి చెప్పనవసరంలేదు. ముఖ్యంగా శివకేశవాలయాల్లో భక్తుల సందడి అంతా ఇంతా కాదు. కార్తిక మాసానికి ఆదిదేవుడు దామోదరుడని కొందరంటే శివుడని మరికొందరంటారు. ఎవరేమన్నా ఈ నెలంతా భక్తిమయమయిందే.

కార్తికమాసంలో సూర్యభగవానుడు తులారాశిలో ఉండగానే వేకువజాముననే నిద్రలేచి చిత్తశుద్ధితో స్నాన మాచరించాలి. దానధర్మాలు, దేవతార్చనలు చేయాలి. దీనివల్ల అనంతమయిన పుణ్యఫలం కలుగుతుంది. ఈ మాసమంతా విష్ణుసహస్రనామార్చన, శివలింగార్చనలు చేస్తే మంచి పుణ్యప్రాప్తి కల్గుతుంది.

**గంగేచ యమునే కృష్ణే**
**గోదావరి సరస్వతి**
**నర్మదే సింధు కావేరి**
**జలేస్మిన్ సన్నిధిం కురు**

ఈ శ్లోకాన్ని స్నానం చేస్తూ పఠిస్తే పుణ్యనదీజలాల్లో స్నానమాచరించినట్టేనని పురాణాలు చెబుతున్నాయి. రావిచెట్టు వద్ద కూర్చుని పురాణాన్ని పఠించినా, విన్నా, శివ విష్ణ్వాలయాలయందుగాని, తులసి కోటవద్దగాని దీపారాధన చేస్తే శుభాలు కలుగుతాయి.

ఈ మాసంలో దీపదానం మహా ప్రశస్తమయింది. సూర్యాస్తమయమందు సంధ్యచీకట్లలో శివకేశవుల సన్నిధిని దీపాన్ని వెలిగించినవారు సర్వపాపహరులై వైకుంఠప్రాప్తి పొందుతారు.

**సర్వజ్ఞాన ప్రదం దీపం**
**సర్వసంపత్ సుఖావహం**
**దీపదానం ప్రదాస్యామి**
**శాంతిరస్తు సదామమ!!**

అని స్తోత్రం చేస్తూ దీపదానం చేయాలని పురాణాలు పల్కుతున్నాయి. అన్నివిధాల జ్ఞానాన్ని కలుగజేసే, సకల

**12-11-2015**
**కార్తికమాసం**
**ప్రారంభం.**





కార్తికమాసాన వచ్చే పౌర్ణమి విశిష్టమైంది.



సంపదలను ఇవ్వగలిగే ఈ దీపాన్ని దానమిస్తున్నాను. శాంతిని ప్రసాదించమని భావార్థం.

ఈ మాసంలో ఉసిరిచెట్టు క్రింద సాలగ్రామాన్ని ఉంచి భక్తితో పూజించి, అన్నదానం చేస్తే మనం చేసిన పాపాలు నశించిపోతాయి. కార్తికమాసమంతా పూజలు చేయలేనివారు ఒక్క సోమవార వ్రతమైనా ఆచరిస్తే మాసఫలం దక్కుతుందని కార్తిక పురాణం చెబుతుంది.



కపిలేశ్వర ఆలయ కొండపైన కృత్తికా దీపోత్సవం (రేఖాచిత్రం)

ఆషాఢ శుద్ధ దశమి రోజున విష్ణువు లక్ష్మీదేవి సహితంగా శేషశయ్యపై పవళించి తిరిగి కార్తీక శుద్ధ ద్వాదశినాడు లేస్తాడు. ఈ మధ్య కాలాన్ని "చాతుర్మాస్యం"గా వ్యవహరించటం జరుగుతుంది. ఈ సమయాన చేసే వ్రతాలు విష్ణుదేవునికి ప్రీతికరం. కావున కార్తికశుద్ధ పౌర్ణమి రోజున కానీ, ఏకాదశి రోజునకానీ లేదా ద్వాదశి నాడుకానీ పూర్ణోపవాసముండి కేశవుని పూజిస్తే సంపదలు కల్గుతాయి. పౌర్ణమి రోజున దీపారాధన చేస్తే సకలపాపాలూ హరించుకుపోతాయని భక్తులు నమ్ముతారు.

కార్తికమాసమంతా హిందువులు దీపాలు వెలిగించి ఇంటి సింహద్వారానికి రెండు ప్రక్కలా అలంకరిస్తారు. కార్తికశుద్ధద్వాదశినాడు 'తులసీవ్రతం' చేసి పూజానంతరం బాణాసంచా కాల్చటం కూడా జరుగుతుంది.

ప్రత్యేకంగా స్త్రీలు 365 వత్తులుచేసి ఏకాదశి, ద్వాదశి, పౌర్ణమి తిథులలో ఆవు నేతితో దేవాలయాల్లోను, తులసి కోటల దగ్గర దీపాలు వెలిగిస్తారు. పలుచోట్ల జ్వాలాతోరణంగా ఆకాశదీపాలను భక్తి శ్రద్ధలతో వెలిగిస్తారు.

కార్తికమాసంలో పౌర్ణమి ముందురోజు కార్తికదీపం పండుగ వస్తుంది. దేవాలయాల్లో ఈ పండుగరోజు విశేషంగా ఉంటుంది. కార్తికదీపం రోజు తిరుపతిలోని కపిలతీర్థంలో కొండపైన దీపాన్ని వెలిగిస్తారు. ఈ దీపాన్ని రెండురోజులు వెలిగిస్తారు. ఈ దీపం చూడడానికి అనేకమంది భక్తులు ఈ తీర్థానికి వస్తారు. కార్తికదీపం స్త్రీలకు సంబంధించిన పండుగ. కాబట్టి అనేక మంది స్త్రీలు కపిలతీర్థానికి వస్తారు. అక్కడ దీపాలను వెలిగించి పూజలను చేస్తారు. కార్తికమాసం కైవల్యానందమార్గం.



# దానధర్మములు

ధరణీప్రగడ సత్యమూర్తి, వాడ్రేవుపల్లి

న్యాయంగా సంపాదించిన ధనాన్ని దుర్వినియోగం చేసే మార్గాలు రెండు. 1) అనర్హునికి ఇవ్వడం, 2) అర్హునికి ఇవ్వకుండా ఉండటం.

మనం న్యాయంగా సంపాదించిన ధనంలో కొంత భాగాన్ని విధిగా దానం చేయాలి. అంతేకాదు అవసరాలకు మించి దాచుకోవడం కూడా మహాపాపమని వేదవేదాంగాలు చెపుతున్నాయి. "అదానదోషేణ భవేద్దరిద్రః" దానం చేయనివాడు వచ్చే జన్మలో దరిద్రుడుగా పుడతాడని మన మహర్షులు చెప్పారు. దానంచేయుట వలన గౌరవం లభిస్తుందని అనుభవజ్ఞులు చెప్పారు. మనం సంపాదించిన డబ్బుకు నలుగురు వారసులుంటారు. 1) ధర్మము 2) రాజు 3) అగ్ని 4) దొంగ. పెద్దవారసుడైన ధర్మానికి పెద్దవాటా ఇవ్వాలి. ఆ విధంగా పెద్దవాటా ఇవ్వక పోయినా, అసలు ఇవ్వకుండా అవమానించినా, మిగతా ముగ్గురువారసులైన రాజు, అగ్ని, దొంగలు అది భరించలేక కోపోద్రిక్తులై మనసంపదమీద వచ్చి పడతారు. రాజు పన్నులను విధించి కొంతధనం స్వాధీనం చేసుకుంటాడు. అగ్నిప్రమాదాలు సంభవించి ఆస్తికి నష్టం చేకూరవచ్చు. దొంగలు దోచుకోవచ్చు. కాబట్టి ప్రతివ్యక్తి తన సంపాదనలో విధిగా, న్యాయమైన వాటాను దాన ధర్మాలకు సద్వినియోగం చేయాలి.



దానం చేసేటప్పుడు కూడా విజ్ఞత ప్రదర్శించాలి. అర్హులైనవారికి మాత్రమే దానం చెయ్యాలి. అపాత్రదానం చేయకూడదు. గుడిని, గుళ్ళో లింగాన్ని, చుట్టూ ప్రాకారాన్ని మింగే ఆషాఢభూతులకు దానం చేయకూడదు.

ఇకపోతే న్యాయంగా సంపాదించిన ధనంనుండే దానం చేయాలి. అక్రమ సంపాదన నుండి ధర్మంచేస్తే అది చెడు ఫలితాలకి దారితీస్తుంది.






దీపావళి పండుగ మొదలుగా కార్తిక మాసమంతా దీపాలపండుగగా జరుపడం ఆనవాయితీ. తిరుమల శ్రీవారి ఆలయంలో కార్తికపౌర్ణమినాడు ఈ దీపోత్సవం విశేషంగా కన్నుల పండువుగా జరుగుతుంది. కార్తిక పున్నమినాటి సాయంత్రం శ్రీ శ్రీనివాసభగవానునికి సాయంకాల కైంకర్యాదులు నివేదనలు పూర్తి అయిన తర్వాత ఈ దీపోత్సవం విశేషంగా కన్నులపండువుగా జరుపుతారు.

మొదట శ్రీ యోగనరసింహస్వామి ఆలయం ప్రక్కన ఉన్న పరిమళం అరదగ్గర నూరు కొత్త మట్టి మూకుళ్లు ఉంచుతారు. అందులో నేతి వత్తులు వేసి దీపాలను వెలిగిస్తారు. తదుపరి వీటిని ఛత్రచామర, మంగళవాయిద్య సమేతంగా ఊరేగింపుతో విమానం ప్రదక్షిణం చేస్తూ, ఆనంద నిలయంలో శ్రీవారికి హారతి ఇస్తారు. ఆ తర్వాత వరుసగా గర్భాలయంలో బ్రహ్మ అఖండం, కులశేఖరపడి, రాములవారి మేడ, బంగారువాకిలి, ద్వారపాలకులు, గరుడాళ్వారు, వరదరాజస్వామి సన్నిధి, వకుళమాత, బంగారు బావి, కల్యాణమండపం, సభ అర, తాళ్లపాక అర, భాష్యకారుల సన్నిధి, యోగనరసింహస్వామి, విష్వక్సేనులు, చందనం అర, పరిమళం అర, వెండివాకిలి, ధ్వజస్తంభం, బలిపీఠం, క్షేత్రపాలకుల సన్నిధి, తిరుమలరాయమండపం, పూలబావి, రంగనాయక మండపం, మహాద్వారం, బేడి ఆంజనేయస్వామి, శ్రీవరాహస్వామి ఆలయం, స్వామి పుష్కరిణి తదితరచోట్ల నేతిదీపాలు వెలిగిస్తారు. కార్తికమాసం పౌర్ణమినాడు తిరుమల కొండలో జరిగే ఈ కార్తిక దీపోత్సవం చూసి తీరాలేగాని వర్ణించడానికి సాధ్యం కాదు.

# ధర్మాచరణ

**వేదుల సత్యనారాయణ,** కాకరపర్రు

ఒక నదీతీరాన ప్రశాంత వాతావరణంలో రెండు పర్ణకుటీరాలు నిర్మించుకుని ఇద్దరు ఋషులు జపధ్యానాదులు చేసుకుంటున్నారు. వారివురు అన్నదమ్ములు. ఆకలివేసినప్పుడు కందమూలాలను, ఫలములను తింటున్నారు. దప్పిక కల్గినప్పుడు వారి కుటీరాలకెదురుగా ఉన్న నదీజలాన్ని త్రాగుతూ తృప్తిగా జీవిస్తున్నారు.

ఒకరోజు ఉదయం స్నాన సంధ్యాదులు ముగించుకుని తమ్ముడు, అన్న కుటీరానికి వచ్చాడు. అన్నగారు ఏదో పనిలో నిమగ్నుడై ఉండి బయటకు రావడం ఆలస్యమైంది. ఈలోగా అన్న కుటీరానికి ముంగిటగల మామిడిచెట్టు నిండా మ్రగ్గిన ఫలాలు చూశాడు. వాటిని తినాలని తమ్ముని మనస్సు ఉవ్విళ్లూరింది. వెంటనే లేచి రెండు పళ్ళుకోసి తెచ్చుకున్నాడు. ఈలోగా అన్న బయటకు రావడం జరిగింది. తమ్ముడు లేచి అన్నకు నమస్కరించాడు. తమ్ముని కుశలప్రశ్నలు వేసి అన్న, అతని చేతిలో మామిడి పండ్లను గమనించాడు. తమ్ముని ప్రశ్నించి విషయం తెలుసుకొన్నాడు.

"తమ్ముడూ! రాలిపోయినపండ్లు తీసుకోవాలి. కాని చెట్టునుండి అడగకుండా కోయడం దొంగతనంతో సమానం. కనుక నీవు దొంగతనం చేసినట్లే" అన్నాడు.

దానికి తమ్ముడు తన తప్పిదాన్ని వెంటనే గ్రహించాడు. తాను చేసిన తప్పుకు తగిన దండన విధించమని అన్నను అడిగాడు వినయంగా. అప్పుడు అన్న "నాయనా శిష్యుడు తప్పుచేస్తే గురువు దండించాలి. బిడ్డ తప్పు చేస్తే తల్లి దండించాలి. ఇలా నియమాలున్నాయి. ప్రజలు తప్పుచేస్తే రాజు శిక్షించాలి. రాజదండన పొందినవానిని యమధర్మరాజు కనికరిస్తాడు. కాబట్టి దేశాధిపతి అయిన మహారాజువద్దకు వెళ్లినీవు చేసిన తప్పు వివరించి తగిన దండన పొందిరా" అని ఆదేశించాడు.

అగ్రజుని ఆజ్ఞానుసారం తమ్ముడు రాజు వద్దకు వెళ్ళగానే రాజు సింహాసనం పైనుండి లేచి మునీశ్వరుని





ఆహ్వానించి ఉచితాసనం ఇచ్చి ఇలా అన్నాడు. "మహాత్మా! తమరి రాక మాకు ఆనందదాయకం, మీ జపతపాదులు ఏమీ ఆటంకాలు లేకుండా సాగుతున్నాయా? మీరు వచ్చిన కారణం తెలుసుకోవచ్చా?" అని వినయవిధేయలతో రాజు ప్రశ్నించాడు.

అప్పుడు తమ్ముడు రాజును ఆశీర్వదించి తన తప్పును తెలియజేసి నిస్సంకోచంగా తగిన శిక్షను విధించమని కోరాడు. రాజు ఆ అన్నదమ్ముల ధర్మతత్పరతకు ఆశ్చర్యపోయాడు. వెంటనే ఆస్థాన గురువులను, న్యాయనిపుణులను ఆహ్వానించి ఈ ఋషిచేసిన తప్పిదానికి శిక్ష ఏమిటి? అని వారిని ప్రశ్నించాడు.

పూర్వపు రాజులు ఎవరినీ నిరంకుశంగా శిక్షించే వారు కాదు. శిక్షలన్నీ శాస్త్రాలను స్మృతులను అనుసరించి అమలు జరిపేవారు. పండితులంతా శాస్త్రాలు పరిశీలించి "ప్రభూ ఏ చేతులు దొంగతనం చేశాయో ఆచేతులను ఖండించడమే ఈ తప్పునకు శిక్ష" అని విన్నవించారు. యధావిధిగా శిక్ష అమలు చేశారు. శిక్షను పొంది తిరిగి తమ్ముడు అన్న ఆశ్రమానికి వచ్చాడు. అన్న తమ్ముని కౌగలించుకొని "నాయనా! నీపై నాకు కోపం లేదు. బోధించే వాడు ఆచరించాలి. ధర్మశాస్త్రాన్ని రాసేవారు వాటిని ఆచరించాలి. మనమిద్దరమూ ధర్మశాస్త్రం రాద్దామని అనుకుంటున్నాం గదా. మనమే వ్యతిరేకమైన పనులు చేస్తే ఎలాగ? ఇక ప్రజలలో ధర్మానికి ఏం విలువ ఉంటుంది? కాబట్టి మనలో దోషం ఉండకూడదనే అభిప్రాయంతో నిన్ను రాజు వద్దకు పంపాను" అన్నాడు. అని ధర్మశాస్త్రం యొక్క ప్రాశస్త్యాన్ని తెలియజేశాడు. ఎదురుగా ఉన్న నదిలో స్నానంచేసి రమ్మని తమ్ముని పంపించాడు.

నదిలో మునిగి లేవగానే తమ్ముని రెండు చేతులు మామూలుగా వచ్చేశాయి. బాహువులను ఇచ్చిన నది గనుక అప్పటి నుండి అది 'బాహుదా' నది అనే పేరుతో ప్రసిద్ధి చెందింది. ఈ అన్నదమ్ములే శంఖ ధర్మశాస్త్ర గ్రంధకర్తలైన శంఖుడు, లిఖితుడు. అందువల్లనే "ధర్మో రక్షతి రక్షితః" అన్నారు పెద్దలు.





# డిశెంబరు నెల రాశిఫలాలు

పంచాంగకర్త: బ్రహ్మశ్రీ తంగిరాల వేంకటకృష్ణ పూర్ణప్రసాద సిద్ధాంతి, తి.తి.దే. ఆస్థానసిద్ధాంతి, రేలంగి



**మేషరాశి** : వ్యాకులత, ధననష్టాలకు అవకాశం వుంది. తాత్కాలిక స్థాన చలనం. నెల మధ్యలో రాకపోకల వల్ల శరీరఅలసట, శత్రుకలహం. డిసెంబరు 21 నాటికి స్వస్థానప్రాప్తి, ఆరోగ్యము కలుగుతాయి. ధనలాభము, ఉత్సాహము, పుణ్యప్రాప్తిని కలుగచేస్తాయి. పరోపకారం చేయాలనే తపన మంచిదేకాని ఆచితూచి వ్యవహరించండి. జీవితభాగస్వామి మాటకు విలువ ఇవ్వండి. అవాంచితసంఘటనలు చికాకు కలిగిస్తాయి. నెలాఖరులో ఆరోగ్యము ద్రవ్యలాభము, సంతోషం, ధైర్యము. ప్రయత్నించిన పనులు అనుకూలం.



**వృషభరాశి** : ఆకస్మిక ధన ధాన్య లాభాలు కలుగుతాయి. కృషి మూలకధనము వస్తుంది. నెల ప్రారంభములో మార్గావ రోధములు. దేశాంతర ప్రయాణము. అధికారమును చెలాయిస్తారు. శరీరసౌఖ్యము, ఆరోగ్యము గౌరవము, సంతోషము కలుగును. దాయాదులతో కలహాలు వద్దు. స్వల్పకాలికఒప్పందములు మంచి చేస్తాయి. ఇది వరలో చేసిన వాగ్దానములు ఆచరిం తురు. మాస మధ్యమున ద్రవ్యలాభము వస్త్రభూషణాదులు మనః సౌఖ్యము ధైర్యము కలుగును.



**మిథునరాశి** : ఆరోగ్య విషయమై జాగ్రత్తలు పాటించండి. దీర్ఘకాలిక రోగ పీడితులకు మరింత జాగ్రత్త అవసరం. ఉన్నత విద్యలాసించువారికి శుభవర్తమానము వస్తుంది. వ్యాపారులకు ఇతర దేశ ప్రయాణాలు ఆర్థికలాభాన్నిస్తాయి. ఈ రాశివారికి ఈ నెలలో మంచిసుఖము. ప్రయత్నించిన కార్యాలు సాధించుట. ధాన్యాది లాభములు కలుగును. నూతనముగా ఇళ్ళు కట్టుటకు వేసిన ప్రణాళికలు ఫలించును. ఇతరులు మీ సహాయాన్ని కోర్తారు.



**కర్కాటకరాశి** : సంతానము విషయంలో శుభకార్యనిర్వహణ గురించి కొంత ఆందోళన ఉంటుంది. మాసాంతంలో బంధువుల ద్వారా శుభవర్తమానం. వ్యాపార వ్యవహారముల్లో ముందడుగు వేస్తారు. ధైర్యము, మొండితనము వల్ల కష్టకార్యములు సులభమౌతాయి. చరస్థిరాస్థులకు చేయు ప్రయత్నములు లాభిస్తాయి. మాసారంభములో శుభ గోచారము. ఆరోగ్యమును ధనలాభము కలుగును. బుధుడు జన్మరాశికి ఆరవరాశిని పొందుట వలన అలంకరణకు సంబంధించిన వస్తువులు, వస్త్రములు, ధాన్యలాభము. అన్నింటికీ మించి మనస్సున ధైర్యమును కలుగచేయును. మాసాంతములో శుభకార్యాచరణ.



**సింహరాశి** : వ్యాపార వ్యవహారములయందు ఒప్పందములు సదవగాహనలు వుంటాయి. సంఘములో కీర్తిప్రతిష్ఠలు కలుగుతాయి. రాహు కేతువుల సంచారము వలన ముఖ వర్చస్సు తగ్గినట్లు అనిపిస్తుంది. కుటుంబ వ్యవహారాల్లో ప్రోత్సాహకరం. ఆరోగ్యము స్థిరముగా స్వస్థతగా వుంటుంది. దూర ప్రాంతములలో వున్న కుటుంబసభ్యుల విజయములు మనస్సుకి ఆనందాన్ని కలుగచేస్తాయి. మనస్సున సుఖము, ఆనందము.



**కన్యారాశి** : సంపద, ఆరోగ్యము పుత్ర కళత్ర సౌఖ్యములు కలుగుతాయి. సంఘములో కీర్తి ప్రతిష్టలు లభిస్తాయి. కన్యారాశి వారు నేత్రముల గురించి శ్రద్ధ వహించాలి. ఉన్నత విజ్ఞానము, దేహసౌఖ్యము,



ఇతరులకు సహాయము చేయుట ధన ధాన్యలాభములు పొందుట. ఉద్యోగస్థులు పైఅధికారుల అభిమానము పొందుదురు. స్వబుద్ధిచే చేసిన కార్యములు కలసివచ్చును. తల్లి పేరున భూక్రయములు చేయుట సంతోషము కలుగును.



**తులారాశి** : సోదర సోదరీగణముకు స్నేహ హస్తం అందిస్తారు. విద్యార్థులు చదువుపై శ్రద్ధ పెట్టాలి. గృహమున మంగళ తోరణములు కట్టుట. శుభ సూచన శుభకార్యచరణ. ఆకస్మికధనలాభము. ధైర్యముతో అందరిని కలుపుకుని ముందుకు సాగెదరు. విజయం సాధిస్తారు. ధన ధాన్య లాభములు. ఉద్యోగులకూ మంచివార్త. గోచారం అనుకూలం. శరీరమందు అనా రోగ్యము తొలగుట జరుగును. మనస్సున ఉల్లాసము, చుట్టములతోడనూ స్నేహితుల తోడనూ కలసియుందురు. కుమారులు కొండంత అండగా ఉందురు.



**వృశ్చికరాశి** : సద్గోష్టి. వ్యాపార వృద్ధి. కుటుంబమునందు పెద్దవారి సలహాసహాయములు ఆశిస్తారు. వృత్తి పరమయిన చికాకులు ఉన్నప్పటికీ పురోగతి సాధిస్తారు. పుత్ర సంతాన విషయంలోనూ ప్రవర్తనలోనూ మార్పు. చుట్టములు స్నేహితులతోడ సఖ్యంగా వుండండి! చేయు వృత్తి వ్యాపారములలో పూర్తిస్థాయి ఫలితాలు ముందు ముందుంటాయి. మాస మధ్యమంలో ఫలితాలు అనుకూలం. బాణసంచా సరుకుల వ్యాపారులకు కొంత లాభము కలుగుతుంది. వ్యవసాయదారులకు ధన ధాన్య లాభం వస్తుంది. ఏల్నాటి శని ప్రభావ దోష నివారణకు ఈశ్వరాభిషేకము, ఆంజనేయ స్తోత్ర పారాయణ చేసిన ఉపశమనము లభించును.



**ధనూరాశి** : మనసున తలచిన కార్యక్రమములు నిర్విఘ్నంగా ముందుకు సాగుతాయి. ఆర్థికాభివృద్ధి కలుగుతుంది. పిల్లలకు ఉద్యోగప్రాప్తి. వివాహాది శుభకార్యములు. నెల ప్రారంభములో జన్మరాశిలో చంద్ర శుక్ర బుధ సంచారం వలన బ్రహ్మాండమయిన ఆనందాన్ని అనుభవిస్తారు. మీ విజ్ఞానాన్ని మెరుగుపరచుకుంటారు. మీకు సభాగౌరవం దక్కుతుంది. విదేశీ విద్యల కొరకు ప్రయత్నాలు కలసివస్తాయి. సౌఖ్యస్థానంలో చంద్రుడు. లాభస్థానంలో రవి, సమస్త భోగభాగ్యాలను అనుభవిస్తారు. సంఘములో మీస్థానమునకు ఉన్న మర్యాద ద్విగుణీకృతం అవుతుంది.



**మకరరాశి** : మనసున ఒంటరితనము అనిపిస్తుంది. ప్రయాణముల విషయంలో జాగ్రత్త వహించాలి. చిన్న వ్యాపారులు అంతంత మాత్ర లాభములు పొందుతారు. మాస ద్వితీయార్థంలో ఆరోగ్యం మెరుగవుతుంది. ధనమునకు లోటు లేదు. సమాజంలో గౌరవం ఉంది. మీ మాట చెల్లుబాటవుతుంది. కొన్ని వ్యవహారాలలో ప్రతి బంధకాలున్నప్పటికీ కార్యం సాధిస్తారు. గృహ నిర్మాణ ప్రయత్నం ఫలిస్తుంది.



**కుంభరాశి** : అధికారవృద్ధి, పుణ్యక్షేత్ర సందర్శనము. ముఖ్యమైన వారి ఆరోగ్యంపట్ల జాగ్రత్త వహించండి! వృత్తి వ్యాపారములయందు చురుకుతనము. ధన లాభమును పొందుతారు. అధికారులకు ఇష్టమైన కార్యాలు చేయండి. నెల మధ్యలోనూ ఆరోగ్యము, ధనలాభము, సంతోషము కీర్తి వర్ధిల్లుట జరుగును.



**మీనరాశి** : బంధువులతో సఖ్యంగా వుండండి. సర్వబాధా విముక్తి కలుగుతుంది. పూర్వ పరిచయములు మేలు చేస్తాయి. బంధుమిత్రుల సలహా సహాయములతో ఒక విపత్తు నుండి గట్టెక్కుతారు. నెల ప్రారంభంలో బుధ శుక్రులు సామాన్య ఫలితములిచ్చునప్పటికీ చివరికి కోరినవి లభిస్తాయి. తలచిన పనులగుట వలన ఆనందము. ద్రవ్యలాభము, కృషిలాభములు కలుగును.



# ఐదు ప్రశ్నలు

చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి

భోజ మహారాజు ధారానగరాన్ని వైభవంగా పరిపాలిస్తున్న రోజులవి. ముఖేముఖే సరస్వతి అని అయన్నుచూసిన, వారికి సరస్వతి అనుగ్రహంవల్ల అపారమైన విజ్ఞానం కలిగి కవిత్వంచెప్పగలిగేవారు. ఒకరోజు ఆ మహారాజుకు తనరాజ్య ప్రజలు ఎంత విజ్ఞానవంతులో పరీక్షిద్దామని మనస్సులో కోరిక కలిగింది. వెంటనే ఆచరణలో పెట్టాడు. ఒక బాటసారిలా మారువేషం వేసుకుని దేశాటనకి బయలుదేరాడు. ఆయన పంచకళ్యాణి గుర్రం అధిరోహించి తూర్పుదిశగా ప్రమాణం అయ్యాడు.

అశ్వం ధారానగరసరిహద్దులు దాటాక వేగంగా పరిగెత్తసాగింది. కొంతదూరం వెళ్లాక మహారాజు ఒక పల్లెటూరును సమీపించాడు. ఊరిబైట ఒక పెద్దమామిడితోట కనిపించింది. ఒక్కక్షణం విశ్రాంతి తీసుకుని ప్రయాణం చేద్దామనుకుని అశ్వాన్ని తోటలోకి మళ్ళించాడు. తోటలోకి ప్రవేశించేసరికి దూరంగా ఒక పెద్ద మామిడిచెట్టుక్రింద పదిమంది పిల్లలు ఆడుకుంటూ కనిపించారు. భోజ మహారాజుకు వాళ్ళు ఏం ఆడుకుంటున్నారో చూద్దామని కుతూహలం కలిగింది. అశ్వాన్ని ఒకచెట్టుచాటున బంధించి వాళ్ళకు కనపడకుండా చెట్లచాటుకు జరుగుతూ పిల్లలు ఆడుకునే స్థలం చేరుకున్నాడు. చెట్టుచాటునుంచి వాళ్ళను పరిశీలనగా చూడసాగాడు.

పిల్లలు అంతా పదిఏళ్ళలోపువాళ్ళే. అందులో అందరికన్న పెద్దవాడు ఒక తిన్నెమీద చెట్టుక్రింద కూర్చున్నాడు. మిగతాపిల్లలందరు రాజుగారి కొలువులో కూర్చున్నట్టు క్రిందరాళ్ళు, చక్కలు వేసుకుని కూర్చున్నారు. తిన్నెమీద కూర్చున్న కుర్రాడు రాజులా అభినయిస్తూ, మన ఆస్థానంలో పండితులకు ఈరోజు చిన్నపరీక్ష పెడుతున్నాను. నేను అయిదు ప్రశ్నలు వేస్తున్నాను. వాటన్నిటికీ ఎవరు సరయిన సమాధానం చెపుతారో వారిని ఘనంగా సన్మానిస్తాను అని అన్నాడు. అలాగే ప్రభూ అని అంతా ముక్తకంఠంగా అన్నారు. సరేవినండి అని ఆ కుర్రవాడు ఇలా అడగడం మొదలు పెట్టాడు.

ఒకటవ ప్రశ్న : ప్రపంచంలోని అందరికన్నా ఓర్పుకలిగినది ఎవరు?

రెండవ ప్రశ్న : ఎవరిచేతా దొంగిలింపలేనిది ఏది?

మూడవ ప్రశ్న : అన్నిటికన్న వింత అయింది, అర్థం కానిది ఏది?

నాల్గవప్రశ్న : మన పాప – పుణ్యాలకు సాక్షులు ఎవరు?

అయిదవ ప్రశ్న : పంచబ్రహ్మలు ఎవరు?

చెట్టుచాటునుంచి చూస్తున్న మహారాజుకు అంతచిన్న వయస్సులో ఆ పిల్లవాడు వేసిన ప్రశ్నలు ఆశ్చర్యాన్ని కలిగించాయి. మిగతావారు ఏంసమాధానం చెబుతారోనని కుతూహలంగా చూడసాగాడు.

ఎవ్వరూ కిక్కురుమనలేదు. అంతా దీర్ఘంగా ఆలోచిస్తున్నారు. ఎవరికి సరైన సమాధానాలు తట్టలేదు. చివరకు ప్రశ్నలు వేసిన కుర్రవాడే లేచి ఎవరూ బదులు పలకటంలేదు నేను చెప్పవచ్చా అని అడిగాడు. కాని భోజరాజుకు ఎదురుగా కూర్చున్న కుర్రవాడికి సమాధానాలు తోచి చెప్పడానికి లేచి నిలబడ్డాడు.

ప్రభూ మీ ప్రశ్నలకు నేను సమాధానం చెబుతాను. మొదటిది భూదేవి ఓర్పులో ఉన్నతమయినది. రెండవది ఎవరిచేత దొంగిలింపబడ శక్యంకానిది విద్య. మూడవది అన్నిటికన్న వింతయినది భగవంతుని సృష్టి. నాల్గవది మనంచేసే పాపపుణ్యాలకు సాక్షులు పంచభూతాలు అయిన ఆకాశం, భూమి, వాయువు, అగ్ని, నీరు. అయిదవది పంచబ్రహ్మలు. 1. వినాయకుడు 2. సరస్వతి 3. లక్ష్మీదేవి



4. ఈశ్వరుడు 5. సూర్యభగవానుడు వీరిని స్మరించినవారికి ఆయురారోగ్య ఐశ్వర్యాలు కల్గుతాయి అని చెప్పడం ముగించాడు.

ఆ కుర్రవాడి సమాధానంవిని రాజులా అభిన యిస్తున్న కుర్రవాడు చప్పట్లు చరిచాడు. అందరూ సంతోషంతో అతనితో చేతులు కలిపారు.

ఇది విన్న మహారాజు ఆనందంపట్టలేక చెట్టుచాటునుంచి ఇవతలకు వచ్చి బాలరాజును, బాలపండితుణ్ణి గాఢంగా కౌగలించుకుని ముద్దు పెట్టుకుని వారిశిరస్సుల్ని ఆనందంగా ఆఘ్రాణించాడు. ఈలోగా తోటమాలి తోటలో గుర్రాన్ని చూసి పిల్లలు ఆడుకునే చోటుకు వచ్చి భోజమహారాజును ఆనవాలు పట్టి నమస్కరించాడు. తోటమాలితో ఈ పిల్లలు ఎవరు? అని మహారాజు ప్రశ్నించాడు. వాళ్ళిద్దరూ నా సంతానం. ప్రభూ తెలియక అపరాధం చేస్తే మన్నించండి అని తోటమాలి ప్రాధేయపడ్డాడు. లేదు ఈ బాలమేధావులిద్దర్ని రాజధాని గురుకులంలో చేర్పించాలి. ఇంత పిన్న వయస్సులో చక్కని పాండిత్యాన్ని ప్రదర్శించిన వీళ్ళను కన్న నీవు ధన్యుడవు. వీరి విద్యాభ్యాసానికి అయ్యే ఖర్చు ప్రభుత్వం భరిస్తుంది అని తన మెళ్ళోని రత్నహారాల్ని ఇద్దరి మెడలో వేశాడు. అందరు వీడ్కోలు చెబుతూ ఉండగా తన పర్యటన ఫలించినందుకు సంతోషిస్తూ అశ్వాన్ని అధిరోహించి రాజధానివైపు సాగిపోయాడు.

విద్య సౌందర్యాన్ని ఇస్తుంది. అది ఎవ్వరూ దోచుకోలేని అపార ధనాగారం! విద్యవల్ల కీర్తి, సంపద, ఆనందం లభిస్తాయి! పాలకులవద్ద గౌరవం లభించేలా చేస్తుంది. ఈ విధంగా మహారాజుకు తన రాజ్యప్రజలలో ఎవరు విజ్ఞానవంతులో తెలుసుకునే కోరిక నెరవేరింది. పండితులు ఎక్కడైనా గౌరవించబడతారు. వారికి దేశకాల సామాజిక పరిస్థితులతో సంబంధం లేదు. విద్య నిగూఢ గుప్తమైన సంపదవంటిదని దాని నమ్ముకున్నవారికి ఎలాంటి ఇబ్బందులు ఉండవని ఈ కథ తెలియజేస్తుంది. 

## రాబోవు సంచికలో....

**సప్తగిరి మాసపత్రిక డిశెంబరు సంచికలో ఈ శీర్షికలు రాబోతున్నాయి...**

| | |
|---|---|
| సనాతనం | అమరవాణి |
| పండుగ | పిల్లలూ... |
| పర్వం | వికాసం |
| సౌభాగ్యం | ఇతిహాసం |
| వైకుంఠపాళి | శ్రీ వైష్ణవం |
| చరిత్ర | |

**వంటివెన్నో ఎన్నెన్నో...!!**

### తిరుమల తిరుపతి దేవస్థానం కల్పించే ఉచితసౌకర్యాలు

**ఉచితలగేజి రవాణాకేంద్రం**

అలిపిరి, శ్రీవారిమెట్టు వద్ద ఉచిత లగేజి రవాణా కేంద్రాలు ఉన్నాయి. నడచి వెళ్లే భక్తులు తమ లగేజీని ఆ యా కేంద్రాలలో అందజేసి ఆ లగేజీని తిరుమలలో ఉన్న లగేజీ రవాణా కేంద్రం వద్ద తిరిగి తీసుకోవచ్చు.

**త్రాగునీరు మరియు రక్షణ**

కాలిబాటలో భక్తులకు దారి పొడవునా త్రాగునీటి వసతులు ఉన్నాయి.

రక్షణనిమిత్తం తిరుమల తిరుపతి దేవ స్థానం సెక్యూరిటీగార్డులు ఉన్నారు.

